# చరమాంకం

(నాటకం)

రచన

తారక రామారావు



ప్రచురణ:

తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు

CHARAMANKAM, a Telugu Play by Taraka Rama Rao


తెలుగు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు 500 004

ప్రథమ ముద్రణ 1987
ప్రతులు 1000
వెల 5 రూపాయలు

అక్షరాలంకరణ శిరా పిల్రాజు

ప్రతులకు
తెలుగు విశ్వవిద్యాలయం,
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు 500 004

ముద్రణ:
శ్రీనివాస ప్రింటర్స్,
నెం. 2 3 520/ఎ.
అంబర్‌పేట,
హైదరాబాద్ 500 013

# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతి ఔన్నత్యానికి ఆ జాతి సంస్కృతి ఒక ప్రతీక అట్టి సాంస్కృతిక వారసత్వం కలిగిన జాతి ప్రపంచచరిత్రలో మహోన్నతంగా పరిగణింపబడుతుంది ఆ పరిగణన పరిధిలో మన తెలుగుజాతి కూడా ఉండడం తెలుగువారంతా గర్వించదగిన అంశం అంటే తెలుగుజాతికి కూడా అపారమైన చరిత్ర, సంస్కృతి ఉన్నాయి గతకాలం నుంచి సంప్రాప్తించిన వీటిని ప్రస్తుతకాలంలో పరిపుష్టం చేసి రానున్న తరాలకు పెన్నిధిగా అందించడం అందరి విధి ఆ విధ్యుక్తధర్మ నిర్వహణలో భాగంగా తెలుగు విశ్వవిద్యాలయం ఆవిర్భవించింది అంతకు పూర్వం సాహితీ సాంస్కృతిక సేవలకుగాను ప్రభుత్వం ఏర్పాటుచేసిన వేర్వేరు అకాడమీలు ఏకలక్ష్యయుతమైన తెలుగు విశ్వవిద్యాలయమనే ఏకఛత్రం కిందకు వచ్చాయి తెలుగుజాతి సాహితీ సాంస్కృతిక సర్వతోముఖ వికాసానికి వేదికగా ఏర్పడిన తెలుగు విశ్వవిద్యాలయం గత అకాడమీల కార్యకలాపాలన్నింటినీ ఇబ్బడిముబ్బడి చేయాలనే పూనికతో ప్రస్థానం సాగిస్తోంది

ఆ ప్రస్థానంలో ఒక మైలురాయి మా ప్రచురణల శాఖ ఈ శాఖ ముఖ్యంగా మంచి సాహిత్యాన్ని ప్రజలకు అందించాలన్నదే మా ఆశయం అందుకే గతంలో ప్రజాదరణపొంది, అలభ్యాలైన కావ్యాలు, ప్రబంధాలతో పాటు అనేక కారణాల వల్ల వెలుగు చూడకుండా ఉన్న ప్రతిభావంతమైన అపురూప అముద్రిత రచనలు, సమకాలీన సాహితీ ప్రక్రియలకు చెందిన గ్రంథసంచయ ముద్రణను ఈ శాఖ చేపట్టింది

సాహితీ, కళా ప్రక్రియలలో నాటక ప్రక్రియ విశిష్టమైనది. పండిత పామర జనరంజనమైన నాటక రంగానికి ఈనాడు తగినంత చేయూత లేదనే చెప్పాలి ఈ దుర్దశను పోగొట్టడానికి యథోచితమైన సేవ చేయాలనే సంక

ల్పంలో భాగంగా సాంఘిక నాటక రచనలపోటీ నిర్వహించాం. నేటి సాంఘిక నాటక రంగానికి మరిన్ని కొత్త నాటకాలను అందించాలన్నదే ఈ పోటీ ఉద్దేశం. పోటీకి వచ్చిన రచనలలో ఉత్తమమైన మూడు నాటకాలకు ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులుగా రు 5,000/-, రు 3,000/-, రు 2,000/- నగదు ఇస్తున్నాం. అట్లా గెలుపొందిన నాటకాలను ప్రచురిస్తున్నాం.

అట్లా గత ఏడాది, అంటే 1986లో నిర్వహించిన పోటీలో తృతీయ బహుమతి పొందిన రచన ఈ 'చరమాంకం' నాటకం. రచయిత శ్రీ ఎన్. తారకరామారావు గారిని అభినందిస్తూ, ఈ నాటకం ప్రజాభిమానాన్ని చూరగొనగలదని భావిస్తున్నాం.

హైదరాబాదు,
తేదీ : 20-11-1987

ప్రకాశకులు,
తెలుగు విశ్వవిద్యాలయం

# అంకితం

ఈ నాటకం,

అపర బ్రహ్మమూర్తి

అర్థధర్మశ్రీ

శ్రీ యం. ఏ. సుబ్బారావు గారికి

కృతిగా అంకితం

—తారక రామారావు

# కృతజ్ఞతలు

'చలి మాంసం,'

నాటక రచనకు బహుమతిగా రూ. రెండువేలు/- ఇచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం అధికారులకు,

నాటకాన్ని జనరంజకంగా తయారు చేసిన దర్శకులు శ్రీ మూర్తి, KSN గారికి, శ్రీకళానికేతన్ కళాకారులకూ,

నాటకానికి ఆముఖం వ్రాసిన శ్రీ వాసిరెడ్డి నారాయణ రావు గారికి,

—తారక రామారావు

శ్రీ కళానికేతన్, హైదరాబాదు వారు 8-4-1987న ఇందిరా ప్రియదర్శినిలోను, 16-8-1967న రవీంద్రభారతిలోను ప్రదర్శించిన చరమాంకం' లోని కళాకారులు

| పాత్రలు | | పాత్రధారులు : |
|---|---|---|
| పి కె స్వామి | : | సర్వశ్రీ యస్ వి ఆర్ యల్ తిరుమలాచార్యులు |
| చైతన్య | : | పి జయరాం |
| బ్రహ్మానందం | | ఆర్ శివకుమార్ |
| సిద్ధాంతి | : | పి నారాయణరావు |
| వెంకటయ్య | : | ఎన్ తారకరామారావు |
| హరిశ్చంద్రుడు | | కె సూర్యనారాయణమూర్తి |
| బంగారురాజు | : | ప్రసాద్ చామర్తి |
| హరేరాం | : | యస్ మురళీధర్ |
| ధ్యానమూర్తి | : | గొన్నాబత్తుల రామారావు |
| ఉషాదేవి | | శ్రీమతి రత్నాసాగర్/శ్రీమతి శకుంతల |

ఆహార్యం : శ్రీ కె హనుమంతరావు

రంగస్థల నిర్వహణ శ్రీ యం సత్యనారాయణ

రంగాలంకరణ శ్రీ శివ, జయ, మురళి

నేపథ్యసంగీతం : శ్రీ కళా బ్రహ్మానందం

దర్శకత్వం :

శ్రీ మూర్తి K S N

# తెరముందుగా..

—శ్రీ వాసిరెడ్డి నారాయణరావు

సాహిత్య ప్రక్రియలన్నింటిలో నాటక రచన ప్రయోజనాత్మక మయినది అందులో చెయ్యితిరిగిన రచయిత తారకరామారావు వీరి నాటకాలు 'ఆత్మసాక్షి', 'మహాప్రస్థానం', 'కురుక్షేత్రం', 'నారిచరామి', 'శరణం గచ్ఛామి' ఎన్నో పరిషత్తులలో పట్టణాలలో ప్రదర్శించబడి బహుళ ప్రజాదరణతోపాటు బహుమతులు ప్రశంసలు అందుకొన్నాయి

'చరమాంకం' మూడురంగాల నాటకం ఇతివృత్తం విస్తృతమైనది సాధారణమైనది కూడా ఈ నాటక రచనాకాలానికి దేశచరిత్రలో అవినీతి అధ్యాయం చరమదశకు చేరుకొన్నదనే విషయం నిర్వివాదాంశము తెల్లారితే ఏ పత్రికచూసినా అవినీతి కుంభకోణాల మయము పార్లమెంట్ ఉభయ సభల లోనూ; రాష్ట్ర విధానసభలోనూ అవినీతి ఆరోపణలే ప్రధాన చర్చనీయాంశాలు కరప్షన్। కరప్షన్। నలభై ఏళ్ళుగా యీ 'అవినీతి' భాగోతాలు వింటూనే ఉన్నాము. ఎటొచ్చి ఇంతవరకు దిగువస్థాయిలో ఉన్న అవినీతి ఎగువస్థాయికి చేరుకొన్నది నలభై ఏళ్ళుగా మనం సాధించిన యీ 'ప్రగతి'కి అద్దంపట్టింది యీ నాటకం జాతి మనుగడకు ఇది 'చరమాంకం' అనే హెచ్చరిక చేస్తుంది యీ నాటకం.

ఇందుగలడందు లేడను సందేహం లేకుండా సర్వాంతర్యామి అయిన నేటి ఆర్థిక, సాంఘిక రాజకీయ అవినీతిని ఎత్తిచూపడానికి రచయిత యీ నాటకంలో ఓ గట్టి ప్రయత్నమే చేశారని చెప్పాలి

గతంలో అవినీతి ఇతివృత్తముగా నాటకాలు రాలేదా? వచ్చాయి, అయితే వాటిస్థాయి వేరు పంచాయితీ ప్రెసిడెంటో, సహకారసంఘ అధ్యక్షుడో, మరేఛోటా రాజకీయ నాయకుడినో అవినీతికి పరాకాష్ఠగా రంగస్థలంమీద

శిలవెట్టడం జరిగింది రాజ్యాంగానికి పునాది స్తంభాలయిన లెజిస్లేచర్, ఎగ్జిక్యూటివ్, జుడీషియరీలలో, పాలకయంత్రాంగంలో ప్రధాన భాగమయిన ఎగ్జిక్యూటివ్‌ను చరమాంకం నాటకంలో ముద్దాయిగా ప్రేక్షకుల ముందు కొస్తుంది

విధాన నిర్ణయాలను అమలు పరచవలసిన బాధ్యతగల యీ ఎగ్జిక్యూటివ్ విభాగానికి అధినేతలలో ఒకరయిన ప్రధాన కార్యదర్శి ఈ నాటకంలో ప్రధాన పాత్ర పి కే స్వామి ఈయన గారి చుట్టూ మిగతా పాత్రలన్నీ తిరుగుతూ ఉంటాయి స్వామి డ్రాయింగ్ రూంలోనే మూడు రంగాల నాటకం జరుగుతుంది చీఫ్‌సెక్రటరీ డ్రాయింగ్ రూం కొన్ని సన్నివేశాల్లో ఫిష్ మార్కెట్‌గా మారిపోతూంది ప్రదర్శనానుకూలతను దృష్టిలో వుంచుకొని కొంతవరకు ఔచిత్యాన్ని వాస్తవికతను రచయిత వదులుకున్నట్టుగా తోస్తుంది

రచయిత స్వామి పాత్రమలచినతీరు ప్రశంసనీయంగా ఉందనటానికి అస్కారం లేదు మిగతా పాత్రల రూపకల్పనలో ఉన్న నిర్దుష్టత స్వామి పాత్ర ఆవిష్కరణలో లోపించిందేమోననిపిస్తుంది ఇందుకు కారణం అర్థంచేసుకోవచ్చు స్టేట్ బ్యూరాక్రసీకి హెడ్‌గా ఉన్నా చీఫ్‌సెక్రటరీ అందరికీ అందుబాటులో ఉండే వ్యక్తిగాదు అతడు ముఖ్యమంత్రి ఒక్కడి అదుపాజ్ఞలలో ఉంటాడు అది సీనియర్టీను కాదని జూనియర్ అయినవాణ్ని ఆ పదవిలో నియమించినప్పుడే। ముఖ్య మంత్రిని ధిక్కరించి అదేమాట కేంద్రానికి వెళ్ళిన ప్రధాన కార్యదర్శులు అనేకమంది ఉన్నారు ప్రధాన కార్యదర్శితో మాట్లాడడానికి జంకే మంత్రులెందరో ఉన్నారు సీనియర్ ఐ ఏ యస్. ఆఫీసర్లు చేతులు కట్టుకొని ఆయన ముందు నిలబడతారు అలాంటి వ్యక్తిత్వం గల పాత్రను రంగస్థలం మీద నిలబెట్టి నాటకం ఆడించడం పెద్దసాహసం అంతసాహసం చేసిన ఘనత రామారావుకు దక్కింది కత్తిమీద సాము చేసినప్పుడు గాయాలకు వెరచిపో కూడదుగదా। అదేచేశారు రచయిత. అందుకే స్వామి అప్పుడప్పుడూ నేను చీఫ్‌సెక్రటరీ అని 'అంటూ మనకు గుర్తుచేస్తుంటాడు అతడు మర్చిపోయినప్పుడు స్వామిగారి భార్య గుర్తుచేస్తూ ఉంటుంద

స్టేట్ బ్యూరాక్రసీకి అధిపతి అయిన చీఫ్ సెక్రటరీని ఆదర్శవాదిగా అందులోనూ గాంధీవాదిగా చిత్రీకరించడంలో వాస్తవికత ఎంత ఉన్నా నాటకీయత గొప్పగా ఉంది. అసలు నాటకం అక్కడే మొదలవుతుంది. తెరతీస్తూనే స్వామి రంగస్థలం మీద 'బిల్డింగ్ ప్లాన్' చూస్తూ దర్శనమిస్తాడు. ఇక్కడ 'బిల్డింగ్ ప్లాన్' అనేది సింబాలిక్ సజెషన్ మాత్రమేనని ఉషాదేవి రంగస్థలంమీద కొచ్చిన కొద్దిక్షణాల్లోనే మనకు తెలిసిపోతుంది. ఎందరో మహానుభావులు కన్నకలలకు ఇల మీద రూపురేఖలు దిద్దాలన్న తపన ఆ కాంక్ష స్వామి పాత్రలో మనకు కన్పిస్తాయి. ఇక్కడ పాత్రోచిత సంభాషణలు వ్రాసి [illegible] చీఫ్ సెక్రటరీ అనేవాడు కూడా పెళ్ళాంతో మామూలు మనిషిలాగే మాట్లాడ రాదని పెళ్ళాం అడుగులకు మడుగులు వొత్తక పోయినా, ఆవిడ ఇష్టాయిష్టాలకు అనుగుణంగా నడుచుకొనరాదని విదితమౌతుంది. హిపోక్రిసీని బ్యూరాక్రటిక్ వదనాన్ని బద్దలు కొట్టి భర్తను నేలబారుమనిషిగా దిగజార్చుతుంది ఉషాదేవి.

అధికారమూ అంతస్తునీ ఉపయోగించుకొని ఇంకా పైకి ఎగబాకాలని ప్రయత్నించే భార్య, ఆదర్శ వాదిగా నవసమాజనిర్మాణానికి మౌలికమైన మార్పుల కోసం ఆరాట పడే విప్లవవాది అయిన కొడుకు చైతన్య మధ్య నలిగిపోతాడు స్వామి. ఆస్తి అధికార ప్రాపకం గల బంగార్రాజు ఒత్తిడులకు తల వొంచి నిస్సహాయతను నిర్మొహమాటంగా ప్రకటించుకొనే దశకు చేరుకొన్న స్వామి మీద జాలీ అసహ్యమూ ప్రేక్షకుడికి కలగడం సహజం. స్వామిలో వచ్చిన యీ మార్పుని క్రమానుగతంగా మూడు 'రంగా'లలోను చాల సహజంగా తీసుకొస్తారు రచయిత. బంగార్రాజు మామూలు 'విలనే' అయినా నిండుతనం సంతరించుకొన్న పాత్ర. ఉషాదేవి ఇచ్చిన అవకాశాన్ని ప్రోత్సాహాన్ని వినియోగించుకొన్నాడే తప్ప తనకైతానుగా చేసిన దుర్మార్గమేమీ నాటకంలో కన్పించదు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న ఆదుర్దాను, అధికారాన్ని సొమ్ము చేసుకోవాలన్న ఆమె ఆరాటాన్ని పూర్తిగా, క్రూరంగా కూడా ఉపయోగించుకొంటాడు బంగార్రాజు. ఉషాదేవి ఇచ్చిన ప్రోద్బలమూ ప్రోత్సాహంతో స్వామిని కొంతవరకు లొంగ తీసుకోగలిగిన ద్యాజ దేవరకి బ్రహ్మాస్త్రం సంధిస్తాడు ముఖ్య మంత్రి తన అండదండలతోనే

పదవిలోకి వచ్చారని, అలాటి ముఖ్యమంత్రి తన చెప్పుచేతల్లో ఉంటాడనే ఇంగిత జ్ఞానం ప్రధాన కార్య దర్శి పదవిని వెలగబెడుతున్న స్వాములాంటి వాళ్ళు తెలుసుకోవలసిన అవసరం ఎంత వాటో తెలియజేస్తారు బంగార్రాజు అంతకుమించి బంగార్రాజు రంగస్థలంమీద చూపించవలసిన క్రూరత్వం దౌర్జన్యం ఏమీ లేదు కాని రచయిత కొన్ని సన్నివేశాల్లో ఆ పాత్రకు విలని ఆపాదించాలని, ఉద్దేశ్య పూర్వకంగా ప్రయత్నించడం జరిగింది ఇవాళ 'మెయిన విలన్' ఒకటి పాత్ర నాటకంలో ఉండి తీరాలనే అభిప్రాయం నాటక సమాజాల వాళ్ళను దృష్టిలో పెట్టు కోవడం వల్ల కలిగించేదేమో ననిపిస్తుంది ఇక్కడ బంగార్రాజు కోరింది, వాళ్ళ ఆక్రమించి గుడిసెలు వేసుకొన్న భూమిని ఖాళీచేయించి తనకు సినిమాహాలు కట్టు కోనేందుకు ఇప్పించమని, అందుకు సంబంధించిన పైలు మీద చీఫ్‌సెక్రటరిని ఒక సంతకం పారేయమంటాడు మాంత్రికుడి ప్రాణం చిలక మెడలో ఉన్నట్టు నాటకానికి ఆయువు పట్టయి సంతకంలోనే ఉండిపోయి మూడురంగాల నాటకంగ రంగ స్థలం మీద ఆవిష్కరించబడుతుంది మిగతా హంగులన్నీ సమకూర్చబడ్డాయి నాటకంలో ఎన్నో పాత్రలు నాటకీయంగా ప్రవేశించి నిష్క్రమిస్తూ ఉంటాయి.

రచయిత ఉషాదేవి పాత్రను మలిచినతీరు ప్రత్యేకంగా చెప్పుకోవాల్సి ఉంది ఒక్కగానొక్క కొడుకుని అందలాలెక్కించాలని తాపత్రయపడి పోతుంది ఆస్తి అంతస్తులున్న బంగార్రాజుతో వియ్యమందాలని ఉవ్విళ్ళూరు తుంది ఉన్న అవకాశాన్ని ఉపయోగించుకోలేని భర్తను పనికిమాలిన అసమర్థుడిగా భావిస్తుంది తన కడుపుతీపిని అర్థంచేసుకోలేని కన్నకొడుకుమీద ఆమె ఆగ్రహాన్ని వెళ్ళబుచ్చుతుంది వివేకాన్ని కోల్పోయిన ఆమె ఆగ్రహం ఎలాంటిదో ముగింపుఘట్టంలో ప్రేక్షకులు చూస్తారు

సాయుధ పోరాటంతో సమాజాన్ని మారుస్తానన్న చైతన్య గుప్త వ్యాసమూర్తి హితబోధతో అస్త్రసన్యాసంచేసి కార్మిక కర్షకులను కలుపుకొని సామరస్యాన్ని స్థాపించడానికి ముందడుగువేసిన చైతన్యను చుట్టుముట్టిన వాళ్ళలో ఉషాదేవి కూడా ఉంటుంది. విశ్వరూపం దాల్చిన మాతృప్రేమ

పూర్తిగా సంభాషణల మీదే ఆధారపడి నడిచే నాటకం ప్రేక్షకుల్ని పెద్దగా ఆకట్టుకోలేదు కొరత్తిపోయి చూసేవారును వదలిపోవడం కూడా కద్దు సంభాషణలలో ఒడుపు పదునూ ఉండి, ఉచ్చారణలో స్పష్టత, సున్నితమైన హావభావ ప్రదర్శన, ధ్వని నిర్దుష్టత ఉంటే మాటలమీద నడిచే నాటకమయినా రాణిస్తుంది 'చరమాంకం'లో రచయిత సంఘటనలనూ, సంభాషణలను సమతూకంలో సంధించి నాటకానికి పుష్టిని, ఊపునూ కలిగించారు

క్లైమాక్సుచేరి యాంటిక్లైమాక్సులో అంతం అయే నాటకాలు అనేకం చూశాం కానీ యీ నాటకం యాంటిక్లైమాక్సు అందుకొన్నట్లుగా అనిపించి క్లైమాక్సు చేరుకుంటుంది। అదే చరమాంకం ప్రత్యేకత।। క్లైమాక్సు కనిపించదు కాని వినిపిస్తుంది। రచయిత రచనా శిల్పానికి ప్రతీకగా ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోతుంది యీ ముగింపు। ఆ ముగింపేమిటో నాటకం చివరిదాకా చదివితే మీకే తెలుస్తుంది నాటక రచనలో ప్రతిభ, నైపుణ్యం గల శ్రీ తారక రామారావు ఇంకా ఎన్నో మంచి నాటకాలు రాసి తెలుగు నాటక రంగవికాసానికి, ఔన్నత్యానికి దోహదం చేస్తారని ఆశిస్తాను ప్రయోజనాత్మకమయిన ప్రగతిశీల నాటకావిష్కరణోద్యమంలో తారకరామారావు ప్రముఖపాత్ర నిర్వహించాలన్నదే నా ఆకాంక్ష అదే కోరిక, తుది మాట కూడా

—x—

# చరమాంకం

[ నా ట కం ]

(తెరలేస్తుంది రంగస్థలమంతా కొద్దిగా కాంతిలో వుంటుంది
అలంకరణ ఉన్నతాధికారి హోదాను తెలుపుతూ వుంటుంది

టి కె స్వామి, నైట్ గౌనుతో వుంటాడు కాఫీ తాగుతూ,
బిల్డింగ్ ప్లానొకటి చూస్తూ వుంటాడు కుర్చీలో కూర్చుని

ఉషాదేవి అప్పుడే నిద్రలేచింది ఆవలిస్తూనే లోపలకు వస్తుంది
స్వామి ఆమె రాకను గమనించడు ఆవలించి చిటికవేసి)

ఉష। హాయ్। డార్లింగ్- గుడ్‌మార్నింగ్ ఏమిటి ప్రొద్దున్నే అంత దీక్షగా చూస్తున్నారు।

స్వామి నువ్వా చూడు (ప్లాన్ ఇస్తాడు ఉష ఓసారి చూసి విసుగ్గా అవతల పడేస్తుంది)

ఉష ఇదా। ముప్పయ్యేళ్ళబట్టి చూస్తున్నదేగా। అయినా మీకెలా విసుగు లేదండీ పట్టువిడవని విక్రమార్కుడిలా ఆ ప్లాన్ గురించే ఆలోచిస్తుంటారు

స్వామి। ఉషాడార్లింగ్ 'నిజమే' ముప్పయ్యేళ్ళుగా కలలు కంటున్నాను ఓ అందమైన, సుందరమైన భవనం నిర్మించాలని

ఉష, అదే నేననేది। మీరెంత బుర్రబద్దలు కొట్టుకున్నా, మీరనుకున్నట్లు ఆ భవన నిర్మాణం జరగదు, ఎందుకా అడియాస।

స్వామి। సారీ। నీతో ఏకీభవించలేను మనిషికి అసాధ్యమైంది ఏదీలేదు అది నా నమ్మకం పోతే మరో విషయం నీకెన్నోసార్లు చెప్పాను మళ్లీ చెబుతాను.

ఉష ఓకే నాకుతెలుసు ఆయన ఎవరో మహాత్ముడు కలలుగని, ఆ కలలు పండకుండానే అస్తమించి, పోతూపోతూ మీ కప్పగించాడు ఎలాగైనా ఆ భవన నిర్మాణం పూర్తి చేయమని, అంతేగదూ?

స్వామి కరెక్ట్ ఆ మనకు ప్రామిస్ చేశా। ఆయన కొన వూపిరుండగా శంకుస్థాపన గూడ జరిగింది పునాదులు లేచాయి అంతే ఏండ్లు గడుస్తున్నా, నిర్మాణం అనుకున్నట్లు జరగటంలా అదే పిటీ।

ఉష మైడియర్ స్వామీ మీ రేమనుకోనంటే—

స్వామి ప్రొసీడ్

ఉష ఆ సుందర భవన నిర్మాణ కార్యక్రమం మీవొక్కరిదేగాదు ఇంకా చాలామందే వున్నారు ఎవ్వరికీ పట్టనప్పుడు మీకెందుకీ దురద?

స్వామి సారీ ఉషా, ఎవ్వరికివారు తమకెందుకు అనుకుంటే, సమిష్టి కార్యం ఏదీ పూర్తిగాదు మనకు స్వాతంత్ర్యం ఎలావచ్చింది?

ఉష బ్రిటీష్‌వాళ్లకు విసుగెత్తి దేశం వదిలిపోతే

స్వామి కాదు కాదు

ఉష లేకపోతే, గాంధీగారి సత్యాగ్రహానికి ఖద్దరు చొక్కాలకూ జడిసి వచ్చిందంటారా

స్వామి అవును బలవంతమైన సర్పము చలిచీమల చేతచిక్కి చావదే, అలాగే ప్రజలు వెల్లువగా లేచి బ్రిటిష్ ప్రభుత్వాన్ని పారద్రోలారు దానికి నడిపుడు, సారథి గాంధీజీ, ఆయన తనస్వలాభం చూసుకోలేదు సమిష్టిలాభం సమాజశ్రేయస్సు ఆలోచించి నడుంకట్టి వారిని కార్యోన్ముఖం చేసుకు మళ్లించారు It is a fact, నగ్నసత్యం

ఉష ఆల్‌రైట్ అది మీ దృక్పథం అవునూ 'అసలు గాంధీకోట కెందుకెళ్ళారిప్పుడు?

స్వామి: సందర్భం వచ్చినడిగనుక అంతే ప్రతివారూ సొంతలాభం కొంతమానుకుంటే, ఈ శవ ం పూర్తవుతుందని, ఆ మహాత్ముని కలలు ఫలిస్తాయని నా నమ్మకం

ఉష: ఆ వి ష యం: పోతే మైడియర్ నేవొవనిమీద వచ్చాను

స్వామి: చెప్పు

ఉష: తాతాగారు రాత్రి గుర్తు చేశారు

స్వామి: రాత్రి పార్టీకి రాలేకపోయాను బాగా జరిగిందా

ఉష: మీరులేనిలోటు వుంతనేవుంది, అయినా డార్లింగ్ మీరు మరీ ఆఫీసును అంటి పెట్టుకుని వంజరంలో పక్షిలా అవుతున్నారు I dont like it పైగా మీరివ్వరు.

స్వామి: Chief Secretary ని అందుకే ఉషా పిలిచిన ప్రతిపార్టీకి రావటం, నా పదవికి అంత మంచిదిగాదు

ఉష: నేనొప్పుకోను మనిషి పైకిపోయినకొద్దీ బాధ్యతలు, బరువులు తగ్గించుకోవాలి: పరిధి పరిచయాలు పెంచుకోవాలి

స్వామి: వలితం?

ఉష: పేరు ప్రాబల్యం స్టేటస్

స్వామి: అవన్నీ నాపదవి వెంటే వుంటాయి ఉషా పైగా ప్రతివారు నా నుంచి ఏదో ఆశించే దగ్గరకు వస్తారు

ఉష: అందులో తప్పేముంది అధికారం అష్టకార్యాలు వున్నాయి. వాటిని ఉపయోగించుకోవాలి

స్వామి: కానీ, నన్ను ఉపయోగించుకోవాలనే అందరూ చూస్తారు I don t like it.

అని అనుకున్నారా కానొరేయ్ ఇస్త్రీలేసయం డబ్బులు ఎడం చేత్తో ఏసిరేసి కుడిచేత్తో సరుకులట్టుకుపోవచ్చు అప్పే అక్కడ డబ్బులిచ్చినా సరుకు దొరకదు అదిసరే, కిరసనాయిలు, పెద పది, వానపదూసి అన్నెల్లయింది

చైతన్య: మా పూళ్ళో కిరసనాయిలు అమ్మే

బ్రహ్మ: వాడున్నాడు నెలనెలా తాలూకా వెళ్ళి కోటా తీసుకుంటాడు అంతేసంగతులు చిత్తగించవలెను వాడ పొయ్యాడు గట్టిగా వాతోతలాడు రెండిసి అడిగితే మర్యాదగా, నీ బాబుకు చెప్పుకో పో అంటాడు

చైత: కార్డ్డాడుకు కంప్లయింట్ ఇవ్వాల్సింది

బ్రహ్మ: నడేసే కాకులను తినే వాడొకడైతే మనుషులనుతినే వాడొకడు ఏడిచాయివాడు అదేం లాభంలేదురా అబ్బిగా.

చైత: మరయితే ఈ అన్యాయాన్ని చూస్తూ పూరుకుంటావా

బ్రహ్మ: ఏం చేయమంటావా ఓరేయ్ పూర్వం ధర్మం నాలుగుపాదాలా నడిచేదట ఇప్పుడు మూతమీద నడుస్తోంది అదేమిటో తెలుసా

చైత: తెలియదు

బ్రహ్మ: నీకు తెలియదని నాకుతెలుసులే నువ్వు నాలా పులిహోరలో కరివేపాకువి ఒకటి మధపతి పుమన్, రెండు మధ్యం పైన్ నాటుసారా, మూడోది అల్లా ఇధర్ హై పైసానే హై అని డబ్బు-ఇవిగో ఈ మూడున్నూ విరక్తులు ఏమిటో ఓరేయ్ అబ్బిగా ఓచిన్న పువకారం చెయ్యాలిరా

చైత: చెప్పు చేరనైతే తప్పకుండా చేస్తా

బ్రహ్మ: రహాకాష్ ఫోనందుకో,

చైత ఎందుకూ, ఎవరికీ

బ్రహ్మ అందుకోముందు అందుకుని మా తాశీల్దారుని పిలిచి చివాట్లు పెట్టు। వెధవ, నేను ఫలానావారి చేలువిడిచిన బావమరిదినిసార్ నాకోదబ్బా కిరసనాయిల్ పోయించండి అంటే, ఇహిహి అని వెధవ నవ్వొకటినవ్వి లేదంటాడా సైగా అంటాడు తెల్లారి లేచిందగ్గర్నుంచీ వారికాలూకు వీరి ఇలాగా అని- తంతూసీన వెధవలు వస్తుంటారు వీళ్లందరి మాట వింటుంటే, ఇహమేం ఉద్యోగాలు చేసినట్లే, అని ముత్తాయింపుగూడాను వ్రాసివెధవ చెయ్యి పోస్తు।

చైత అయిఒ అన్నదాంట్లో తప్పేముంది మావయ్య

బ్రహ్మ తప్పలేదు అదికాదురా ఆ వెధవ సుటికొంతకు వెధవటుకలని కోటాటంతా అమ్మేసుకుంటున్నార్రా ఇది అన్యాయంగరా

చైత అలా అయితే నన్నేం చెయ్యమంటావ్

బ్రహ్మ అలా ఏదిగావు బావుంది మీ నాన్న పేరు చెప్పి వాడిని దబా యించు రాలు విగరా కళ నే చూసుకుంటాను.

చైత సారీ మావయ్య చెట్టుపేరుతో కాయలు అమ్ముకోవటం నాకు గిట్టని పని

బ్రహ్మ అంతేనంటావా

చైత అంతే నీ హక్కులకోసం పోరాడు అంతేగానీ ఇలా వక్ర మార్గంలో క్షణిక లాభాలకోసం ఆశించకు వస్తా

(వెళ్లపోతుండగా సిద్ధాంతి ప్రవేశం మంత్రాలు చదువుతూ చేతిలో రాగిచెంబు అందులో తమలపాకులతో నీళ్ళు / తల్లా చల్లుతూ ప్రవేశం)

చైత। ఏమిటి సిద్ధాంతిగారూ ఈ తతంగం.

సీద్ధా బాబా! ఈ ఇంటికి గ్రహదోషముంది పైగా వాస్తుశాస్త్రరీత్యా గూడ ఈ ఇల్లు కట్టబడలేదు అందువల్ల గ్రహశాంతికి, తన్నివారణోపాయానికి పూజలు చేస్తున్నా

చైత! మా దాదీకి తెలుసా!

సీద్ధా తలిదాదు వారి అనుమతి లేకుంటానా

చైత బాగుంది రామరాను మనం ఎటుగుతున్నామో పతనమవుతున్నామో నాకర్థంకావటంలేదు

బ్రహ్మ! నీ సందేహం నాకర్థంగాలేదురా అబ్బాయి మీకు బోధ పడిందా సీతాంబిగారు

సీద్ధా వారు ఆధునికులు వారి మనోగత భావాలు నాకెలాగుత తెలియును

చైత ఇందులో తెలియనిదేంలేదు మనది మతప్రసక్తిలేని లౌకిక రాజ్యాంగం అయినా ఈ రాజ్యాంగాన్ని సరిచేయటానికి మంత్రాలన్నా, వర్తాలన్నా దుర్ముహూర్తాలన్నా పట్టింపులున్నాయి ఇది హాస్యాస్పదంగాదా!

సీద్ధా బాబూ తమ అంతర్యం నాకు విశదమవలేదు దేవుడు దయ్యం ఇవి లేవనా తమ అభిప్రాయం

చైత! ఉన్నాయోలేదో! మతం మూఢనమ్మకాలు వ్యక్తిగత అభిప్రాయాలు, అంతే! వాటి తాము నమ్మిన ఆచారాలను ఇతరులపై రుద్దటం కూడదని

బ్రహ్మ! ఇందులో కూడనిదేముందిరా అల్లుడుగారూ ఇంటికి దోషం వుంటే

సీద్ధా ఆ దోష పరిహారార్థం తగు నివారణోపాయాలు ఆలోచించుట ఆచరించుట దోషమా ఏమి బ్రహ్మానందముగారూ

క్రైర ఈ యింటికి దోషముందా।

సిద్ధా అవును

క్రైర ఎవరు చెప్పారు

సిద్ధా నేను నాకు తెలిసిన శాస్త్రిమున్నా

క్రైర। నూటయాభై సంవత్సరాలనాడు కట్టిన ఈ బంగళాకు దోష ముందని మీరు ఈనాడు నిర్ణయిస్తున్నారు అంతేగదూ। మరి న్నాళ్లుగా వున్న వాళ్లంతా హాయిగా వున్నారు వాళ్లందర్నీ పట్టిపీడించని గ్రహాలు ఈనాడు మా దాడిని పట్టుకుని, పీక్కు తింటాయా Trash (వెరతాడు)

సిద్ధా। బ్రహ్మానందముగారూ। ఈ యువకులకు ప్రాచీనార్ష సంస్కృతిపై ఏకమెత్తు నమ్మకములేదు ఆధారములను తూలనాడెదరు దేవుడిని తిరస్కరింతురు ఈ జాతి మున్ముందు ఏమగునో గదా।

బ్రహ్మ, ఏమిగాదు సిద్ధాంతిగారూ వెనకటకోదేవత తాలితోతన్నిన సాహెబును వదిలేసి, దణ్ణం పెట్టపోతున్న దానయ్య పీకట్టుకుందిట యిదేం న్యాయం తల్లీ అంటే ఏమందో తెలుసా

సిద్ధా। శలవియ్యండి

బ్రహ్మ। ఆ వకీరు ఎలాగూ నామీద నమ్మకం లేదు వున్న బక్కుడాయివి నీకెంపోయ్యేకాలం దీపం, ధూపం, నైవేద్యం పెట్టమందిట అలాగే ఈగ్రహాలు గూడ నమ్మకముంటే వాళ్లనే పీక్కుతింటాయి।

సిద్ధా। చక్కగా శలవిచ్చారు మరికలదా

బ్రహ్మ ఉండండి సిద్ధాంతిగారూ వడివడి వచ్చినా యింతదూరం ఏంలాభం చూడండి అరేయ్ అబ్బాయి కిరసనాయిలు కావాలిరా అంటే వీడు నావల్లగాదు అన్నాడు పోయిపోయి దబ్బా కిరసనాయిలుకోసం మాబావనడిగితే ఏం బావుంటుంది ఏమంటారు,

సిద్ధా: చక్కగా శెలవిచ్చారు బ్రహ్మంతట వాడు ప్రత్యక్షమై ఏమి వరము కావలెనో కోరుకొమ్మని అడిగిన మూర్ఖుడు మా మేన మామ చెప్పులలో కేశనంవద ఇయ్యమని అడిగాడుట

బ్రహ్మ: అంతే సిద్ధాంతిగారూ చిన్నవాళ్ళవల్ల పనులుగావు పెద్దవాళ్ళ చిన్నపనులు చెయ్యరూ ఏమిటో సిద్ధాంతిగారూ రానురాను బ్రతుకు కష్టమై పోతున్నది, సామాన్యులకు దీనికంతకూ కారణం ఏమిటంటారు

సిద్ధా: ఏముందిబాబూ రాచరికం లేకపోవటమే బ్రిటిషువారుండగా ఇట్లుండేనా లేదు మరిప్పుడో వూరికొక నాయకుడు అందరూ పెత్తందారులే ఋక్కులు చింపిన విస్తరికొలె సత్యము ధర్మము లేక రాజ్యము దయనీయముగా నున్నది

మాన్యంబులీయ సమర్థుడొక్కడు లేడు
మాన్యముల్ చెరుప సమర్థులంత
ఎండిన యూళ్ళ గోడెరిగింపదెవ్వడు
పండిన యూళ్ళకు ప్రభువులంత
ఇతడు పేదయటంచు నెరిగింపదెవ్వడు
కలవారి సిరులెన్న గలరు చాల
తనయాలి చేష్టల తప్పెన్న దెవ్వడు
పెరకాంత రంకెన్న పెద్దలంత
ఇట్టిదోషుల కధికారమిచ్చినట్టి
ప్రభుల తప్పంటుచును పలుకవలెను
భూషణ వికాస శ్రీధర్మపురి నివాస
దుష్టసంహార నరసింహ దురితదూర

(చివరి రెండు చరణాలు బ్రహ్మానందం గూడ సిద్ధాంతితో కలిపి చదువుతాడు)

బ్రహ్మ: ఆహా! ఆహా! ఏంబాగా శెలవిచ్చారు సిద్ధాంతిగారు

(ఉషాదేవి ప్రవేశము)

ఉష సిద్ధాంతిగారూ ఆయన స్నానంఅయింది మీకోసం చూస్తున్నారు (సిద్ధాంతి వెడతాడు) ఏరా నువ్వెప్పుడు రావటం। అంతా కులాసాయేనా?

బ్రహ్మ అహా। ఏదో మీదయవల్ల ఇలావున్నాం అమ్మగారూ పల్లెటూళ్లల్లో బ్రతకటం చాలా కష్టంగావుందే।

ఉష అదేమిట్రా, ప్రణాళికల మీద ప్రణాళికలు, గ్రామాల అభివృద్ధి అని ఘోషిస్తుంటే నువ్వేమో ఇలా అంటావ్।

బ్రహ్మ అంతేనే, పేరు పెద్దలది, నోరు పట్నాలది ఊరికే అన్నారు మా వూరికీ ఓ బస్సు వేశారు మంత్రిగారితోపాటు ఓసారొచ్చింది మళ్లీ ఆ వూలేదు అదేమంటె రోడ్డు బాగోలేదు అన్నారు వూరికి కరెంటు వచ్చిందా, అదీ అంతే గాలివానొస్తే కరెంటు వుండదు ఎండాకాలం కరెంటుకోత। ఏం చెప్పమంటావులే మా భాగ్యం అరచేతిలో వైకుంఠం

(బయటినుంచి హరిశ్చంద్రుడు ప్రవేశం)

హరి నమస్కారం తల్లీ (సాష్టాంగ దండప్రణామం చేస్తాడు)

ఉష। అదేమిటయ్యా లే లేముందు లే। ఏమిటిదంతా। వెంకటయ్యా - వెంకటయ్యా

హరి। అమ్మా హరిశ్చంద్రుణ్ణి ఇంటిపేరు గాలి

ఉష అదిసరే అప్పుల సంగతేమిటి?

బ్రహ్మ ఏదన్నా చందాకొచ్చాడేమో।

హరి కాదు బాబూ।

ఉష। ఉద్యోగం కావాలి అంతేనా।

హరి, వేలమ్మాద్రి తల్లీ! అందుకే ఇలా ముక్కాలోక జీవితం గడుపుతు
న్నాను

ఉష ఎందుకొచ్చావ్?

హరి మీరు ఆలకిస్తానంటే రహస్యంగా చెబుతా!

బ్రహ్మ! నేనలా ఆ గదిలో వుంటాలే (వెళతాడు)

ఉష! నాకు టైంలేదు చెప్పు త్వరగా!

హరి! అమ్మమ్మ అలా కసిరితే అన్నలు చెప్పలేను ఆ తరాత్వర
మీదయ!

ఉష! చూడు హరిశ్చంద్రుడుగారూ నాకు క్షణం తీరికలేదు నన్ను
విరిచేసి హరికథ చెబుతానంటే కుదరదు

హరి అయితే అమరణ నిరాహారదీక్ష పూనుతా.

ఉష. ఇక్ తంద్రీ! నాకవతలం తోలితు వస్తున్నాయి. యింటికి పెద్ద
వాళ్ళొస్తారని కబురొచ్చింది యిలా వేధిస్తావుంటే ఎలా?

హరి! తమరలా అంటే చిన్నవాణ్ణి నామొర ఎవరు ఆలకిస్తారు? నాకు
దిక్కెవ్వరు.

ఉష నావల్ల ఏంగాదు వెళ్ళి ఏ నాయకుడినో మరెవరినో ఆశ్రయించు
వెళ్ళు

హరి! అంతేనా! మీరు సాక్షాత్తు బీదలపాలిట కల్పతరువని విన్నాను
ఎందరో తమ పూజా గృహాల్లో తమ ఫోటోను వుంచుకుని
మాయింటి దేవత అని కొలుస్తున్నారు మీరు అమ్మ, అమ్మలకు
అమ్మ అని భజనలు చేస్తున్నారే ఇదంతా అబద్ధమా!

ఉష చూడు హరిశ్చంద్రుడూ, భజన మానేసి ఆ భజనలు ఏ పెద్దవాళ్ళ
తోనో చెయ్యి నీకోరిక తీరుతుంది పైకొస్తావు

హరి! లాభంలేదు తల్లీ, నాయకులన్న ప్రతివాడి ఇంటిముందూ కొత్తేటి
కాంతాదులా రైనుతో జనం వున్నారు ఆ రైనులో నిల్చుంటే

మనకంతువచ్చేసరికి, ఆ నాయకుడు పదవిలో వుండొచ్చు లేదా అదే ముందు మొయ్యొచ్చు ఇక నాబోటివాడికి దారిగో దారే. పైగా ఓ నాయకుడి ఇంటిముందు లైనులో నిలబడ్డామని తెలిస్తే మర్నాకడు రానియ్యడు అమ్మా నావల్లగాదు, లైనులో నిలబడ టం అంటేత

ఉష. పోనీ సన్మాం చెయ్యమంటావు.

హరి. ఏంలేదుతల్లీ నాకు చదువురాదు ఆస్తిలేదు ఎన్నికల్లో నిలబడ దామంటే నాకులంవోళ్లు ఉండగాలేరు తద్యులేదు ఇహ మిగిలేది దిక్కు

ఉష. రామచంద్రప్రభో. సన్మాం చావమంటావు

హరి. తల్లీ అయ్యగారితో చెప్పి గాలిహరిశ్చంద్రుడు బహుయోగ్యుడు మనవాడు అతన్ని ఓ కమిటీలో వెయ్యండి ఓ కంపెనీకి డైరెక్టరుగా పారెయ్యండి నేంబతుకుతాను తమపేరు చెప్పుకుని పైకొస్తాను

ఉష. ఉహూ. బాగుంది సర్లేవెళ్లు ఇదిగో చూడు, ఇలా నన్ను పట్టు కుంటే పనవుతాయని నీకెవరు చెప్పారు

హరి. గ్రహించాను తల్లీ.

ఉష. అవా. ఎలా.

హరి. నిజం చెప్పమంటారా, అబద్ధం చెప్పెయ్య మంటారా.

ఉష ఈ ఒక్కసారికి నిజమేచెప్పు

హరి. అఖిల భారత సాధువుల సంఘం ప్రారంభోత్సవం తమరిచేతి మీదుగా జరిగింది సింహాల క్లబువాళ్లు వీరోళ్లకు కళ్లజోళ్ళు మీచేత యిప్పించారు ఐదు నక్షత్రాల హోటలుకు మీరే శంకు స్థాపన చేశారు హరిజనవాడతో లైట్లు మీరే వెలిగించారు ఇవన్నీచూసి గ్రహించాను తమరు గొప్పోరి భార్యేగాదు, నిజంగా మీరే గొప్ప అని.

ఉష। ఓహో। చూడు హరిశ్చంద్రుడూ, నీ తెలివికి చాలా సంతోషం వెళ్లిరా।

హరి। మళ్లెప్పుడు రమ్మంటారు

ఉష మళ్లీ ఇలా ఇంట్లో తారబడి అల్లరి చేశావంటే పోలీసుల్ని పిల్చి కొట్టో చేయిస్తాను అండర్‌స్టాండ్ గెటవుట్। వెంకటయ్యా। (వెంకటయ్య ప్రవేశం యూనిఫారంలో)

వెం। టయ్య। అమ్మా। ఇక్కడేవున్నాను

ఉష। ఈయన్ను లోపలికెందుకు రానిచ్చావు బాడు, మళ్లీ పావలా పరకా పుచ్చుకుని ఎవర్నిపడితే వాళ్లను లోపలికి రానిచ్చావంటే నీ ఉద్యోగం తీసేయిస్తాను తెలిసిందా మీరు వెళ్లండి (హరిశ్చంద్రుడు వెడతాడు) ఇప్పటిదాకా ఎక్కడి కెళ్లావ్।

వెంక। నేనా అమ్మ అలా స్మోకింగుకు వెళ్లా

ఉష। డామిట్। మరోసారి ఇలాచేశావంటే జాగ్రత్త చూడు అయ్యగారు ఇవ్వాళ ఎవర్నీ చూడరు ఫోనొచ్చినా అదేచెప్పు ఇక్కడేవుండు।

(వెడుతుండగా ఫోన్ మ్రోగుతుంది వెంకటయ్య అందుకుని 'హల్లో' అంటాడు)

ఉష। ఎవరది (ఫోన్ అందుకుని) హలో నేను ఉషాదేవిని ఆ। ఓ మీరా। చెప్పండి యంగ్‌ఉమెన్స్ ఆర్గనైజరా బావుంది ఉ ఊ చాలా థాంక్స్ చూడండి మీరేమీ అనుకోవద్దు అహ అదిగాదు ఇప్పటికే, ప్రతి సభలోనూ నేనే కనబడుతున్నానని కొందరేడుస్తున్నారు నో నో అదికాదండి అబ్బా యిలా బలవంతం చేస్తేఎలా। మీరోసారిరండి మాట్లాడుకుందాం అలాగే। (ఫోన్ పెట్టేస్తుంది బ్రహ్మానందం ప్రవేశం ఫోన్‌లో మాట్లాడుతుండగానే।) చూశావురా బ్రహ్మం ఆయన ఉద్యోగంగాదుగానీ।నన్ను తోరిగల్లావద్ది పిలేస్తున్నారు

అది చెయ్యండి, ఇదిచెయ్యండి అని కాదంటే నిష్టూరాలు. ఏమిటో (వెతుకుతుంది)

బ్రహ్మ వెంకటయ్యా! చూడబోతే ఏనుగు బాధలు ఏనుగువి, ఈగబాధలు ఈగవి లావున్నాయి

వెంక అంతేగదండి. బాబూ నేను కొత్తలో ఉద్యోగంలో చేరినప్పుడు ప్యూను పనిఅంటే పాడిఆవు లాంటిదండి జీతం పాతిక పైన ఎంతలేదన్నా మరోపరక వచ్చేవండి ఇప్పుడు ఇప్పుడు పైసా యిచ్చే పిటీషనేస్తున్నారండి జనం

బ్రహ్మ అంటే ప్రభుత్వోద్యోగం లాభం లేదంటావా?

వెంక ఛ ఛ తక్కువ్రాయకుగదండి యిది మాపైవాడు మనక్కత్తి తిరగాడు బయిటోడు నరేసరి ఇంటోడు ముండా అంటే, దారేపొయ్యేవోడు దొంగముండా అంటాడు

బ్రహ్మ। నేనన్నానయ్యా మాకు తెలిసిన ఓ ప్యూను వున్నాడు అతడు ఉద్యోగం ఎప్పుడుచేస్తాడో ఆ పైవాడికే ఎరుక ఉదయం పాల వ్యాపారం, పగలు వడ్డీ వ్యాపారం, రాత్రి నాటుసారా దుకాణం నడుపుతాడు వాడిమీద పిటీషన్ల వర్షం అయినా ఆడినికదిపిన వాడులేదు

వెంక ఏమో బాబూ. నేనయ్యగారి దగ్గర పనిచేస్తున్నాను. అప్పు అరు తినడు ఇకనాకేంవుంది? పరగడుపు చ్చే, ఓపావలా పారెత్తండి రెండు చుట్టలు తెచ్చుకుంటా పళ్ళులాగేస్తున్నయ్యి

బ్రహ్మ నువ్వడిగేది లంచమా, మామూలా బహుమతా.

వెంక। ప్యూనెప్పని లంచం తీసుకోనండి పావలేగదండి ఇచ్చింది అందుకని బహుమతిగాదండి

బ్రహ్మ సరే ఓ పావలా ఇస్తాగానీ, ఓ తిరసనాయిలు దబ్బా యిప్పించా.

వెంక ఏటండి మరీ ఇచిత్రం పావలాకు తిరసనాయిలు. అందుకే మా

దణ్ణా ఎలా వస్తదండీ బాబూ దానికి ఖర్చవుద్దండీ।

బ్రహ్మ అంటే లంచం యివ్వాలా।

వెంక అంతేగదండీ

బ్రహ్మ నేను స్వామిగారి వేలువిడిచిన బావమరిదిని, ఆ సంగతి గుర్తుంచుకో।

వెంక బాబూ। మీరు వేలువిడిచిన బావమరిది అయ్యేది, వేలువిడవని బావగారయ్యేది ఏంలాభంలేదు కరణనాయాలు కావాలంటే అంతే మరి

బ్రహ్మ మా బావతో చెబుతాను

వెంక బ్రహ్మదేవుడితో మొరెట్టుకున్నా లాభంలేదు దూల్బాబూ। ఆటిని అతిక్రమించటం ఎవ్వరి తరంగాదు.

బ్రహ్మ పిటీషను పెడతా।

వెంక అదిగూడ బాబూ పైనటిస్తేనే పరిశీలించేది।

బ్రహ్మ అంతేనా?

వెంక అంతె వెనకటికి మీలోటి వారొకరు మంత్రి మావాడు, అని కరణానికి మామూలు ఇవ్వక ఎగనామంపెడితే, ఆ కరణం ఏంచేశాడో తెలుసా।

బ్రహ్మ ఏం చేశాడు

వెంక। అయితే యిదిగో బంజరుభూమి నెంబరు మంత్రిగారికి బోయి ఆర్డరేయించుకో అన్నాడు ఏడు ఆర్డరేయించు కొచ్చాడు అంతే, ఆడికాభూమి దక్కలేదు

బ్రహ్మ ఏం?

వెంక కలెకటేరు భూమి కొలతలు పరచటానికి పోతే ఆ భూమి, కరణం పోడు ఇచ్చిన నెంబరు భూమి స్మశానం అద్దదీ సంగతి కలకటేరు కళ్లెర్రజేసి కరణాన్ని గానుకో లేదా బాబూ। అందుకే

అదు నీకు నామం పెట్టాడు అని అన్నాడు. కనుక బాబా కొన్నివస్తకి, ప్రభుత్వంలో వరవతి లాభంలేదు

బ్రహ్మ శివ శివా! (పోటోతాడు)

వెంక బాబా కిరననాయిలు వద్దా

బ్రహ్మ వద్దు కట్టెలతో కాలక్షేపం చేస్తాను

వెంక మరి నా పావలా

బ్రహ్మ ఇవ్వను లంచం, బహుమతీ, మామూలు ఇవ్వను (వెళతాడు)

వెంక ఛ ఛ, వెధవబ్రతుకైపోయింది గడ్డివామిదగ్గర కుక్కకావలా అయింది ఉద్యోగం తెల్లారిందగ్గర్నుంచి పదిపైసలన్నా రోజీ కాలేదు

(లోపల్నుంచి చైతన్య పుస్తకాలతో బయటకు వెడుతూ ఆగి)

చైతన్య అ, చూడు వెంకటయ్యా నే బయటకు వెడుతున్నా వాకోసం మా ప్రొఫెసర్ ధ్యానమూర్తిగారొచ్చినా, ఫోన్ చేసినా నేను బయటకెళ్లానని చెప్పు ఏం?

వెంక! అలాగే బాబా (బయట నుంచి హరేరాం ప్రవేశం)

చైతన్య! (హరేరాంతో) మీరు?

హరె నాపేరు హరేరాం క్రిష్ణభక్త సమాజం నడుపుతున్నాను

చైతన్య I See! మీ సమాజం ఉద్దేశ్యాలు తెలుసుకోవచ్చా

హరె! Very glad క్రిష్ణస్వామి ఒక్కడే దేవుడు He is Incarnation of God! ఆయన గురించి భజనచేసి కీర్తనలుపాడి, యూనివర్స్‌ను తెలుసుకోవచ్చు అదే ఈ ప్రపంచాన్ని రక్షిస్తుంది

చైతన్య! అంటే, మీరు అపార్థంచేసుకోవద్దు భజనలు కీర్తనలుపాడి,

ప్రైమరలి, మనిషి సోమరిపోతు అవుతాడు ప్రజలంతా చైతన్య రహితులవుతారు అప్పుడు ఏమవుతుంది?

హారె అంతా ఆ శ్రీకృష్ణస్వామి స్వరూపమే ఆయనే రక్షకుడు శక్తి ఉంటుడు ఆయనకు అసాధ్యమైంది, చెయ్యలేనిది ఏంలేదు మీరు మా పుస్తకాలు చదవండి అందులో అంతా వివరించాం।

చైతన్య Thank God నాకు వీటిమీద నమ్మకంలేదు నా దృష్టిలో మానవుడే మహనీయుడు మానవుడు రాగద్వేషాలు, మత మౌఢ్యం, జాత్యహంకారం వదులుకుంటే విశ్వమానవుడు అవుతాడు అతడే దేవుడు ప్రపంచంలో ఆకలి, అజ్ఞానం, అంధకారం అప్పుడే తొలగుతాయి అప్పుడే సమసమాజం ఆవిర్భవిస్తుంది

హరె నో। నో। May I knew your name

చైత చైతన్య,

హారె మిస్టర్ చైతన్య మీరు తప్పుదోవలో వున్నారు మెటీరియలిజం, మార్క్సు, కమ్యూనిజం యివన్నీ మీలాంటి యువకుల్ని తప్పుదారిలోకి నడిపిస్తున్నాయి

చైత సారీ। మీ యిజాన్ని కాదన్న వాళ్ళంతా కమ్యూనిస్టులూ, మతాన్ని వద్దన్న వాళ్ళంతా చార్వాకులు అనుకోకండి। వస్తా మళ్ళీ తీరిగ్గా చర్చించుకుందాం (వెళతాడు)

హరె నాయనా ఇతను

వెంక అయ్యగారి కొడుకు తమరు।

హారె ఈ। విజిటింగ్ కార్డ్ ఇవ్వు

వెంక। ఎవరికియ్యమంటారు

హారె ఉషాదేవి గారికి

(వెంకటయ్య వెళ్ళబోతుండగా లోపల్నుంచి P K స్వామి కట్టుపంచె, ఉత్తరీయం, నుదుట బొట్టు, చేతుల్లో తులసిదళాలు, మెళ్ళో తులసిమాలతో వస్తారు, ఆయన వెనుక సిద్ధాంతిగారు)

స్వామి: ఎవరు ఎవరు కావాలి?

వెంక: అమ్మగారితో పనిట సార్

స్వామి: వస్తారు అలా కూర్చోండి ఆ సిద్ధాంతిగారూ చెప్పండి ఆ ఏం అల్లుడికి Transfer అంతేగా, చూద్దాం ఆ. ఏం చెల్లితండి,

సిద్ధా: తమరికి ఆ పరమేశ్వర స్వరూపంగా ఎంచుకుని, నమ్ముకుని వున్నాను అంతామీదయ మరికొంత సాయంత్రం అభిషేకం చేయిస్తాను

స్వామి: మంచిది. (సిద్ధాంతి వెళతారు)

స్వామి: (హరిరాంతో) నిలబడేవున్నారేం కూర్చోండి ఆ వెంకటయ్యా వాళ్ళేం పుచ్చుకుంటారో అడిగి తెచ్చి ఇవ్వు.

హరి: తమరితో నా కంతగా పరిచయం లేదు మేడంగారికి నా సంగతంతా తెలుసు

స్వామి: I see నాకు తీరిక తక్కువ మా ఆవిడ Public contacts ఎక్కువ మంచి సోషల్ వర్కర్ ఆ వస్తుంది కూర్చోండి

హరి: నేను తమరితో మాట్లాడదామనే వచ్చా

స్వామి: Is it Official Obligations అయితే రేపు ఆఫీసుకురండి నేను ఇంటి దగ్గర ఆఫీసు విషయాలేం మాట్లాడను అది నా ప్రిన్సిపుల్ మీరు వినేవుంటారు

హరి: ప్రైవేటు పనే,

స్వామి: అయితే చెప్పండి ఆ వెంకటయ్యా నువ్వు బయటవుండు,

PA వస్తే వుండమను చెప్పు (వెంకటయ్య వెళ్లాక) చెప్పండి What Can I do for you ?

హరె। (సంచి లోంచి కొన్ని పుస్తకాలు తీసి టేబుల్ మీద వుంచి) ఇవి మా లిటరేచర్। మా క్రిష్ణ భక్త సమాజం కార్యక్రమాలు అంతర్జాతీయంగా, జాతీయంగా చాలావున్నాయి మీలాంటి గొప్పవాళ్లు పెద్దవాళ్ల ఆశీస్సులు, అండదండలు అందించారు మాకు

స్వామి I see మీ సమాజం గురించి విన్నాను

హరె మాకు ప్రచారం గిట్టదు, మావాళ్లంతా dedicated souls క్రిష్ణభక్తులు అంతే। అయినా, మమ్మల్ని గిట్టనివాళ్ళు వాళ్ల ఏజంట్స్, ఫిల్లపంచమాంగదళం అంటారు అది నిజంగాదు

స్వామి కరెక్ట్ ఆ చెప్పండి నేనేంచెయ్యగలను

హరె క్రిష్ణ మందిరం అంటే ప్రార్థనకు హాల్ లైబ్రరీ ఇవి కట్టా లనుకుంటున్నాం యూనివర్సిటీ ప్రొఫెసర్స్, పెద్దపెద్ద కం పెనీ డైరెక్టర్లు, సైంటిస్ట్స్ అంతాకలసి ఓ కమిటీగా ఏర్పడ్డారు. ఆ కమిటీకి మీరు చీఫ్ ప్యాట్రన్‌గా వుండాలి ఉషాదేవి గారికి తెలుసు।

PK। అరెరె। మా ఉష మీకు చెప్పలేదేమో। నేను చీఫ్ సెక్రటరీ కాక ముందు ఎన్నో సంఘాలకు, కమిటీలకు ఆర్గనైజేషన్స్‌కు ప్రెసి డెంట్‌గా ప్యాట్రన్‌గా వుండేవాడిని ఏదో శక్తనైన సాయం చేస్తుండేవాడిని కానీ చీఫ్ అయ్యాక అన్నిటినీ వదిలేసుకున్నా ఎందుకంటే నేను చాలా ప్రిన్సిపుల్డ్‌గా వుండాలిగదా। It is my duty ఆ- Thank God, మీరేం అనుకోవద్దు

హరె: అదిగాదుసార్। మాది ఇంటర్ నేషనల్ ఆర్గనైజేషన్

PK అవునవును నాకు తెలుసు। ఒక విధంగా మీలాంటి సంస్థలతో

ఎసోసియేట్ కావటం ప్రివిలేజ్‌గూడ కాని, మీకు తెలియన్ది
ముంది నేను గవర్నమెంట్ First Servant ని గదా। ఆ।
అందువల్ల కాండక్ట్ రూల్స్ పర్మిట్ చెయ్యవు ఆ। నే రిటైర
య్యాక నేనే మీ లలిత సమాజంలో చేరతాను ఏం?
Best of luck వస్తా (వెడతాడు)

(హరేరాం ఏం చెయ్యాలో తోచక నిలబడి వుంటాడు ఇంతలో వెంకటయ్య హడావుడిగా వచ్చి)

వెంక। బాబూ। మీవస్తైతే వెళ్ళండి. (భుజం మీది తువ్వాలు చేత్తో డోర్ కర్టెన్ ఎత్తి పట్టుకుని) దయచేయండి సార్।

(బయట నుండి బంగార్రాజు ప్రవేశం ఓ చేతిలో ఫారిన్ సిగరెట్ కేసు, మరో చేతిలో హ్యాండ్‌బ్యాగ్‌తో)

వెంక। అయ్య రాజుగారూ। ఇలా , ఇలా దయచెయ్యండి

(బంగార్రాజు కూర్చున్నాక వినయంగా చేతులుకట్టుకుని వెంకటయ్య) 

వెంక ఏం తెమ్మంటారు 

బంగా। ఏం వద్దోయ్ . అంటూ ఏవేవరు ., నిల్చునేవున్నారు కూర్చోండి 

(హరేరాం కూర్చుని) 

హరే। త్రిష్ణ సమాజం గురించి వినేవుంటారు. దాని కార్యదర్శిని పేరు హరేరాం

బంగా అవునండి విన్నాను కార్లోపోతూ చూశాను చాలా బావుంది.

హరె తమరి పేరు

వెంక వారు బంగార్రాజు గారు, లేసుకోర్స్ ప్రెసిడెంట్ సంఘానికి అధ్యక్షులు, చిత్ర పంపిణీదారులూ, ।

నేను వారితో తిరిగ్గా మాట్లాడాలి చెప్పానుగా రాత్రి

ఉష వారిపూట ఎంగేజ్‌మెంట్స్ అన్నీ కాన్సిల్ చేసుకున్నారు

బంగా। నాకు తెలుసు మీరే చేయించి వుంటారు అన్నాడు నన్నడిగితే మొగవాడు వాగుపడాలన్నా, చెడిపోవాలన్నా ఆడవాళ్లే ముఖ్యం ఏమంటారు ఇది నా అభిప్రాయం గాదు సుమా।

(PK స్కాచి సూట్ వేసుకుని)

PK: వెంకటయ్యా! అరె రాజాగారెవ్వరూ రాకటం।

బంగా ఏది ఇవ్వాల్టే మీరున్నారు నాకోసం చాలా సంతోషం

PK। ఉషా రాజాగారొచ్చారు మరి వారికి ఏం ఇస్తావు కాఫీ టీ।

బంగా అమ్మమ్మ ఇవేంవద్దు చూడండి స్వామిగారూ మా పెద్దాడు అమెరికా వెళ్ళొచ్చాడు నేనే రమ్మన్నాను. అరేయి, భారత దేశం బంగారు భూమి నీ చదువు, శక్తిసామర్థ్యాలు ఈ దేశం కోసమే ఉపయోగించాలి అన్నాను వాడు OK అన్నాడు మర్చిపోయినా ఈ పాకెట్ తీసుకోండి

PK। ఏమిటో అది?

బంగా। చెప్తా మావాడు ఫ్రాన్స్ నుంచి మీకోసం తెచ్చాడు షాంపేన్. ఒక్క పెగ్ వేసుకుంటే చాలు। తీసుకోండి।

PK నేను గాంధేయవాదిని। రాజాగారు మర్చిపోయ్యారేమో।

బంగా అమ్మమ్మ గుర్తే. నే చెప్పా మావాడికి వాడేమంటాడంటే తాగితే తప్పేముంది డాడీ అయినా ఇది మహారాజులు, మహాత్ములు తాగేది కనుక మీ యిష్టం ఏంచేసినా సరే। అన్నాడు ఆల్ రైట్। నాకు మీరంటే ఎనలేని గౌరవం కనుక మీరేం చేసుకున్నా సరే। వాడన్నాడు. మీకిచ్చేను।

ఉష: రాజాగారంత ప్రేమగా ఇస్తుంటే వద్దనగూడదండీ

PK Ok, Ok చెప్పండి రాజాగారూ।

రంగా నా సంగతి నే చెప్పుకోగూడదు దేశంలో ప్రొహిబిషన్ చాలా Strict గా అమలు పరచాలండీ, లేకపోతే చూడండి, అలగా జనం పూటుగా తాగేసి, తెల్లార్లూ ఒకటే అల్లరి అగడాలు

ఉష ఏమైంది రాజా గారూ

రంగా చెబుతా। స్వామిగారూ। ఇదివరకెప్పుడో ౬ ఎకరాలు కొన్నా ఖాళీగావుంటే బీదాబిక్కీని పిల్చి వెధవల్లారా ఇక్కడ గుడిసె లేసుకు బ్రతకండిరా అన్నా వాళ్ళ వేసుకున్నారు

ఉష। ఇప్పుడేమంటారు అక్కడుంది లేవమంటారా

రంగా। అంతే ఉషాదేవిగారు బాగా గ్రహించారు మా పెద్దాడు ఆ స్థలంలో ఇంటర్నేషనల్ హోటల్ కడదాం అన్నాడు సరేకాని య్యమన్నాను అదీ సంగతి వాళ్ళలేవరు పైగా టీవి మినిష్టరు గారు date ఇచ్చి హోటల్కు శంకుస్థాపన చేశేద్దాం అంటున్నాడు,

ఉష నిజమండీ ఈ అలగాజనం ఎక్కడపడితె అక్కడ ఖాళీస్థలాలు ఆక్రమించేసి, సిటీ అంతా పాడు చేస్తున్నారు పైగా ప్రభుత్వం వాళ్ళుగూడ వాళ్ళకు సపోర్ట్

రంగా। అమ్మా అలా అనకండి నేనొప్పుకోను. భారతదేశమంటే ప్రజలే గదమ్మా వాళ్ల పురోభివృద్ధికి మనమంతా కృషిచేయ్యాలి తప్పదు ఏమంటారు స్వామిగారు

PK కరెక్ట్।

రంగా మీరోసారి వస్తే ఆ స్థలం చూద్దురుగాని ఏమంటారు

PK। చూద్దాం యిప్పుడేం తొందర

రంగా। అలాగే తొందరేంలేదు చూడమ్మా స్వామిగారి ఎదుట చెప్పగూడదుగానీ, టీవీమినిష్టరుగారికి వీరంటే ఎంతో గౌరవం.

నాతో నిన్నే అన్నాడు స్వామిలాంటి ఆఫీసర్ల అరుదోయ్‌రాజా ఎంత నిజాయితీ, ఎంత నిక్కచ్చి। అలాంటి వాడుంటబట్టే, ప్రభుత్వం యింత సవ్యంగా నడుస్తోంది అని అన్నట్లు మీ చైతన్య ఏడీ।

ఉష బయటకెళ్లాడేమోనండి

బంగా మా అబ్బాయిగారు, మీ అబ్బాయిగారు క్లాస్‌మేట్స్‌గధా మావాడు అంటాడు, నాన్నా, చైతన్య ఆలోచనలు, ఆశయాలు తియ్యటి గవర్స్ ఏమైనా స్వామిగారు అదృష్టవంతులు అణుకువ, అనురాగం గల భార్య, ఆణిముత్యాల్లాంటి సంతానం ఏమిటో।

PK: రేపు ఆఫీసుకురాండి, మీ file చూద్దాం।

బంగా అలాగే। అయినా స్వామిగారూ మనం మిత్రులం ఆ సంగతి మర్చిపోయి, నిష్పాక్షికంగా ఫైలుమీద నిర్ణయం తీసుకోండి

ఉష- తాతయ్యగారూ, మీరు నిశ్చయంగా వుండండి. అంతా వారు చూసు కుంటారు

బంగా: అలాగే। మీరంతమాటన్న తరువాత ఇకనాకేంతిరుగులేదు రేపే ఖుర్‌దోఖర్స్ పంపి, స్వగృహ చదును చేయిస్తాను మళ్ళీ మూహం వస్తుందంటున్నారు, మేడంగారూ గొంతెండిపోతున్నది.

ఉష డ్రింక్స్ తెప్పిస్తా

బంగా వద్దు స్వామిగారు ఏమనుకోనంటే

స్వామి, చెప్పండి మీ మాట కాదనేదేముంది

బంగా మీ కభ్యంతరం లేదంటే । ఏంలేదు మావాడు ఆ షెంపేన్ సినాగూడ చూడనివ్వలేదు స్వామిగారు Ok అంటే Just Share చేద్దాం

స్వామి ఇప్పుడా।

ఉష। అబ్బా మైరియ్యార్ ఇప్పటివ్వరూ రారు నోరుతెరచి రాజా గారు అడిగారు కావుండదు ఆ బాటిల్ ఇలా ఇవ్వండి

(ఉష బాటిల్ తీసుకు వెడుతుంది)

బంగా స్వామిగారూ। నిజంచెప్పొద్దూ నేనూ మీలాగే గాంధీగారి సిద్ధాంతా లంటే పడిఛస్తాను, ఆయన ఆశయాలకు కార్యరూపం ఇవ్వా లని కలలు గంటున్నాను ఏమిటో ఎప్పటికి ఆ కలలు పలి స్తాయో నేనేరో మంత్రులను Influence చేసి, మీకు Chief Secretary పదవి ఇప్పిందానని గొడవ ఏమిటో స్వామిగారు పెదవది దబ్బిందటంగూడ ఇబ్బిందే ఏమంటారు

స్వామి। కరెక్ట్ కరెక్ట్

(ఉష Drinks తో ప్రవేశిస్తుంది)

బంగా అదేమిటి రెండు గ్లాసులే తెచ్చారు

ఉష నాకింకా పూజ కాలేదు మీరు తీసుకోండి నేనీలోపల మీక్స్ ఏర్పాటు చూస్తా

బంగా। ఏమిటో। ఉషాదేవిగారూ, నిజం చెప్పొద్దూ మనం మనవస్త్రులు , పాతకాలం మనుషులం ఈ నవ నాగరికతకు సరిపోం

PK Have it

ఉష తీసుకోండి

బంగా। ఎవరూ రారుగదా। ఎందుకంటే మన తిండి మనం తిన్నా లోకానికి భయపడాలి

(స్వామి-రాజా గ్లాసులు తీసుకుని చీర్స్ చెప్పుకుని ఓ Sip చేస్తుండగా బయటనుంచి వ్యాసమూర్తి-చైతన్య ప్రవేశం)

వ్యాస సారీ మీరు ఆనందాన్ని పంచుకునే సమయంలో నేరావటం పొరపాటే, మా కాలేజీ సమస్యలతో మిమ్మల్ని ఇబ్బంది పెట్టటం

మర్యాదగారు క్షమించండి. చైతన్యా మరోసారి వస్తా
(వెళతాడు)

(క్షణం చైతన్య ఉన్న ముగ్గుర్నీ చూసి)

చైతన్య దాడి. పాపం. ఆ గాంధీగారి ఫోటో నెందుకు అవమానించటం
సేయించండి దాన్ని ఇక్కడ నుండి
(విసురుగా వెళతాడు)

(ఉష రాజా స్వామి ఒకర్నొకరు చూసుకుంటుండగా తెర)

రెండవ రంగం

(తెర తొలగేసరికి P.K. స్వామి ఫైల్స్ చూస్తుంటాడు వెంక
టయ్య ప్రక్కన నిలబడి, Files అందిస్తుంటాడు
Phone మ్రోగుతుంది వెంకటయ్య అందుకుని 'హలో'
అంటాడు)

వెంక సార్ మీకు ఫోన్

స్వామి ఎక్కణ్ణుంచి (file చూస్తూనే)

వెంక హలో ఎవరుసార్ మాట్లాడేది? ఆ. ఆ. పోలీస్ కమీష
నర్ గారు

స్వామి. (ఫోన్ అందుకుని) Yes హలో ఏమిటి ఫైరింగా. అసలంత
దూరం ఎందుకెళ్ళింది I see I see నేనిప్పుడే
బయలుదేరి వస్తున్నాను ఆల్ రైట్ ఎవరన్నా చచ్చిపో
య్యారా. I see (ఫోన్ పెట్టేసి) వెంకటయ్యా. డ్రైవర్ని
కారుతెమ్మను (లోపలకు వెళతాడు వెంకటయ్య బయటకు
వెళతాడు) (బయట నుండి బ్రహ్మానందం ఓ అట్ట, దాని
నిండా కొత్తకాలం బాలికా వ్రాసుకు ప్రవేశిస్తాడు)

బ్రహ్మ లంచగొండితనం నశించాలి. నశించాలి లంచగొండితనం రైతులకు గిట్టుబాటుధర ఇప్పించాలి కంట్రోలు ధరలకు పంచదార, కిరసనాయిలు పంపిణీ చెయ్యాలి చెయ్యాలి (అని అరుస్తుండగా, కోటు తొడుక్కుని స్వామి, ఆయన వెనకాల ఉష ప్రవేశం)

ఉష మీరెళ్లి త్వరగా కారు పంపండి అవునూ పోలీసు కాల్పుల్లో, రాజాగారి మనుషు లెవరన్నా పొయ్యారటనా.

స్వామి తెలియదు వస్తా (Exit)

బ్రహ్మ: ఏమిటే బావ హడావుడిగా వెళుతున్నాడు కాల్పులెక్కడా.

ఉష: వెధవది క్షణం సుఖంలేని ఉద్యోగంలా ఆయనది. ఎక్కడో పోలీసులు కాల్పులు జరిపారుట, పరిస్థితి గందరగోళంగా వుందిట. వెళ్లారు

బ్రహ్మ: అదే, గొడవేమిటి అని.

ఉష: రాజాగారు లేరూ

బ్రహ్మ అగాగు ఇంకా ఈరోజుల్లో రాజాలూ, చక్రవర్తులూ ఎక్కడున్నారే.

ఉష: నీకోగోల. బంగారాజుగారని మనకు బాగా కావల్సినవాడులే. ఆయన స్థలంలో గుడిసెలవాళ్లు ఇళ్లేసుకున్నారు ఈయన five star హోటల్ కట్టాలే, లేవండర్రా అంటె వాళ్లు లేవటం లేదు

బ్రహ్మ అదిగాదే ఉషా. నాకు తెలియక అడుగుతాను. జనం కూటికీ, గుడ్డకూ, అలమటించి ఆకులు మేస్తూంటే, అయిదు నక్షత్రాల హోటళ్ళు దేనికి.

ఉష: ఏడిసినట్టుంది నీ తెలివి. దేశమంతా గుడిసెలే అయితే, విదేశస్థులుచూసి నవ్వుతారు అయినా దేశం అభివృద్ధి చెందేదెలా.

బ్రహ్మ: అంటే హోటళ్లు, సినిమాహాళ్ల అభివృద్ధికి చిహ్నాలా?

బ్రహ్మ: ఓరేయ్! నీ తలతిక్క ప్రశ్నలకు సమాధానం చెప్పటం నావల్ల గాదు తెలిసిన వాడికన్నా చెప్పొచ్చు, తెలియని వాడికన్నా చెప్పొచ్చు అవునూ ఈ అర్థమేమిటి?

బ్రహ్మ: మా కోర్కెలు

ఉష: మా అంటున్నావ్ యింకెవరేమిటి

బ్రహ్మ: మా అంటే ప్రజల కోర్కెలన్నమాట ప్రజలంటే మా గ్రామంలో ప్రజల కోర్కెలు చదువుతా విను

ఉష: ఓరేయ్ నాకిప్పుడు తీరికలేదు

బ్రహ్మ: ఇదేమాట మా తాశీల్దారన్నారు మా జిల్లా కలెక్టరూ అన్నారు. అంతేగాదు మా ఎం ఎల్ ఏ కూడ అన్నారు అందుకే సత్యాగ్రహం చెయ్యాలని వచ్చా

ఉష: What a pity ఈరోజుల్లో ప్రతివాడికి ప్రతి చిన్న విషయానికి ఆందోళన, సత్యాగ్రహం చెయ్యటం హాబీ అయింది అప్టరాల్ వెధవ పంచదారకూ, కిరసనాయిల్ కూ సత్యాగ్రహమా!

బ్రహ్మ: ఆఫ్టరాల్ కాదె చెల్లెలా! అలా పల్లెల్లో కొచ్చిచూడు జనం ఎలా కరువు కాటకాల్తో అలమటిస్తున్నారో కావాల్సినవి దొరకక పండిన వస్తువులుకొనే నాధుడే లేడు.

ఉష: అయితే?

బ్రహ్మ: మావూరి వాళ్లంతా నన్ను పంపారు ప్రభుత్వానికి మా మొర వినిపించవయ్యా అని

ఉష: Damnit మీ బావ ఉద్యోగం చేసేది పంచదార ఇప్పించేందుకు కిరసనాయిలు పోయించేందుకుగాదు Don't forget ఆయన చీఫ్ సెక్రటరీ!

బ్రహ్మ: అందుకే ఆయనకు చెబుదామని వచ్చా. ఏమయ్యా బావా, రాష్ట్రానికి చీఫ్ సెక్రటరీవిగదా. ప్రజల కనీస అవసరాలు తీర్చ డం కష్టసుఖాలు విచారించడం నీ పనిగాదా అని.

ఉష: అది ఆయన పనిగాదు

బ్రహ్మ: మరెవరిది?

ఉష: మీరు ఓటువేసి ఎన్నుకున్న నాయకులది.

బ్రహ్మ: సరేలె. ఆయనేవుంటే మంగలాడెందుకూ. మా నాయకులు వినాయకులు. ఎన్నికలవస్తేను తప్ప మళ్లీ అయిపూ అనవాలూ దొరకదు అదలా వెతికి ఎవరినన్నా పట్టుకుంటె, ఆయనవల్ల ఏమీగాదూ

ఉష: సరేలె. నీ క్షోభ నువ్వుపడు. వస్తా చూడు ఆయన అలసి పోయి వస్తాడు రాగానే నువ్వు కందిరీగలాగ నీ సమస్యలతో విసిగించకు. (వెడుతుంది)

బ్రహ్మ: అల్లరిగొండితనం నశించాలి. ప్రజలగోడు ప్రభుత్వం వినాలి (వెంకటయ్య ప్రవేశం) మంచినీళ్ళు కావాలి.

(వెంకటయ్య కూడా బ్రహ్మానందాన్ని విచిత్రంగా చూసి ఆయ టకు పైకలో వెళ్లబోతాడు)

బ్రహ్మ: వెంకటయ్యా! మంచినీళ్లుగావాలి.

వెంక: ఏది బాబూ. అలా చెవులు తెగిన నక్కలా అరుస్తున్నారు ఏది సంగతి.

బ్రహ్మ: మంచినీళ్లుగావాలి, ఆ తర్వాత పంచదార కిరసనాయిలు కావాలి

వెంక: బాబూ. నాదో చిన్న దరమ సందేహం అడుగేదా.

బ్రహ్మ: అడుగు

వెంక: మీరెప్పుడు అదికావాలి యిదికావాలి అని అరుస్తుంటారు ఇదే మన్నా జబ్బా మీకు

బ్రహ్మ: కాదు వెంకటయ్యా, పల్లెల్లో జనం ఎల్లా బ్రతికడానికి కటకట లాడుతున్నారో ఏ బస్తీ వాళ్లకు తెలియదు. పేపర్లో వ్రాయరు. రేడియోల్లో చెప్పరు అదే బస్తీలో పంపులో నీళ్లురాకపోతే పేపర్లో ఫ్రంట్ పేజీలో వేస్తారు లారీక్రింద కుక్కపడితే బొమ్మ వేస్తారు. పల్లెల్లో పదిమంది తిండిలేక చచ్చినా ఎవరికీ పట్టదు యిదేమి అన్యాయం అని అడిగేందుకు మనిషుండడు నర్లే కుండినీళ్ళట్టుకురా।

వెంక। లేను బాబూ।

బ్రహ్మ: అదేం?

వెంక. వరకుటూ రూల్ బాబూ।

బ్రహ్మ। అంటే?

వెంక అంటే ఏటని చెప్పేమి బాబూ మా బాధలు. మాకు పనులు చెయ్యటమేగానీ మాగోడు చెప్పుకునేందుకు వీలులేదు అన్యాయం అని అరిచేందుకు లేదు అందుకని మా నాల్గవ తరగతి వాళ్లంతా వరకు టూ రూల్ చేస్తున్నాం

బ్రహ్మ: అంటే పనులు చెయ్యరా?

వెంక ఎంతమాట చేత్తాం కానీ మావని ఎంతో అంతే అ పైన చెయ్యం అదనా పనులు అస్సలు చెయ్యం

బ్రహ్మ। బాగుంది వెంకటయ్యా. ఎవ్వరి పనులు వాళ్ళుచేస్తే ఇకలేనిదే ముంది ఏవరిపనివారు చెయ్యకపోబట్టే గదా ఈ అందోళనలు. సరిలే ఈ అట్టపెట్టుకో (వెంకటయ్య చేతిలో పెట్టి బ్రహ్మానందం లోపలికెళతాడు అంతలోనే బయట నుంచి హరిశ్చంద్రుడు ప్రవేశం)

హరి: అహా! ఆహా! వెంకటయ్యా నిన్ను చూస్తుంటే నాకు ఆనందంగా వుందయ్యా ఈనాటికి నువ్వు కళ్లుతెరచి, నీ హక్కులకోసం

పోరాడుతున్నావ్ సంతోషం ప్రపంచ ప్రజలారా ఏకంకండు మీకు పోయ్యేదేంలేదు (వెంకటయ్య అట్ట హరిశ్చంద్రుడు చేతిలో పెట్టి వెడతాడు)

(బ్రహ్మానందం ప్రవేశం)

బ్రహ్మ। ఎవరో వస్తారని, ఏదో చేస్తారనీ ఎదురుచూడకూ అన్నారెవరో కవి. (హరిశ్చంద్రుడితో) స్వామి, తమరెవరు,

హరి। నేను ప్రజాసేవకై పుట్టినవాడిని ప్రజాబంధు హరిశ్చంద్రుణ్ణి

బ్రహ్మ అహా। ప్రజాసేవకై పుట్టిన ప్రజాబంధు। తమరేంచేస్తుంటారు.

హరి। బాబూ। భారతపాకిస్తాన్ మైత్రికోసం। అరబ్ ఇజ్రాయిల్ మధ్య శాంతికోసం, అణ్వాయుధాల పరీక్షల రద్దుకోసం, ఇలా అంతర్జాతీయ సమస్యల పరిష్కారంకోసం అహోరాత్రాలు కృషి చేస్తుంటా।

బ్రహ్మ। ప్రజాబంధుగారూ నాకు కిరసనాయిలు, పంచదార కాడాలి ఇప్పించగలరా।

హరి। బాబూ తమ పేరేమిటో

బ్రహ్మ। బ్రహ్మానందం

హరి। ఆనందంగారూ, మీరు చెప్పేవి చిన్న సమస్యలు అవి రోజూ వుండేవే। పైగా ఎన్ని ప్రభుత్వాలు మారినా, అపోజిషనోళ్ళు ప్రభుత్వంలోకి వచ్చినా, ప్రభుత్వంలోవోళ్ళు అపోజిషన్లోకి పోయినా, లేదా అట్లా, ఇట్లా, ఏట్లా వాళ్ల కలిపోయినా కలిపోవచ్చునేమోగానీ, ప్రజల సమస్యలు తీర్చలేరు కనుక నేమనవి చేశదేమంటే అంతర్జాతీయం

బ్రహ్మ। ఇంటగెల్చి, రచ్చగెలవమన్నారుగదా।

హరి ఎం॥ మాట శెలవిచ్చారు బాబూ మనది ఇట్టా చచ కాదు ఇక్కడ ఒకడు హిందీ కావాలంటాడు, మరోడు నక్సేషిరా

హరి. చూడు బాబూ పూర్వం బియ్యంలో రాళ్లేరేవాళ్లు ఇప్పుడు రాళ్లలో బియ్యం ఏరుకోవాలి అలాగా ఎవరు ఏరివరుదూ? అన్నది తేల్చడం అయ్యేపనిగాదు నిత్యావసర వస్తువులు సరవరా చెయ్యాలి చేస్తున్నారుగదయ్యా, పూరితో సారాయి దుకాణం వీధికో వైనుషాపుల ద్వారా చూడండి బ్రహ్మనం దంగారూ నా గొప్ప నేచెప్పుకోగూడదుగానీ! ఏ సమస్య టూకీగా చెప్పండి ఈ లిస్టులో కోరికలు తీర్చడం నావల్లగాదు

బ్రహ్మ! ప్రణామందు హరిశ్చంద్రుడు గారూ

హరి! వింటున్నా చెప్పండి

బ్రహ్మ మా తాలూకాలో గణపతని ఓ ఆఫీసరు వున్నాడు వాడు చెయ్యని అక్రమం, చేయించని అన్యాయంలేదు, వాడి భరతం పట్టు

హరి! శహబాష్ బాబూ ఇక చూసుకోండి నా తఢాఖా, రాండి

బ్రహ్మ ఎక్కడకూ?

హరి! చూడండి బాబూ! మీరు ఒంటరిగా అరిస్తే ఎవ్వరూ వినరు కనరు నూటొక్కనరు కనుక నే మనుషుల నేర్పాటుచేస్తా పత్రికల వాళ్లను పిలుస్తా మహజర్లు పెట్టిస్తా అకతి సత్యాగ్రహాలు ధర్నాలూ జరిపిస్తా రాండి నావెంట

బ్రహ్మ! పద (ఇద్దరూ వెడుతుండగా సిద్ధాంతి ప్రవేశం) ఒంటి బ్రాహ్మడు ఎదురొచ్చాడయ్యా.

సిద్ధా బాబూ! మీరు వెళ్ళు కార్యము జయమగును వెళ్లిరండు

హరి! యింతా ఈరోజుల్లోగూడ శేమ్మలు ఎదురొస్తే పనులౌతావడమూ కాకపోవడమూ అంటూవుందా అసలు బ్రాహ్మడెవరూ కానిది వరు యిదో అంతర్జాతీయం ఇంతకు మీరు

బ్రహ్మ నేను కాఫీహోటలు, క్రోడిపెట్టని, గ్రుడ్లు తింటాను ప్రేద

(ఇద్దరూ వెళతారు క్షణం సిద్ధాంతి నిలబడి వుండగా ఉషా దేవి ప్రవేశం)

ఉష। వెంకటయ్యా! అరె సిద్ధాంతిగారా కూర్చోండి నిలబడే వున్నారేం। వెంకటయ్యా, (వెళ్ళి Phone dial చేస్తుంది.' ఫోన్ Engage శబ్దం రావటంతో మళ్ళీ dial చేస్తుండగా)

వెంక ఏమ్మా పిలిచారా।

ఉష కారింకా రాలేదు రాగానే నాకు చెప్పు హలో। హలో।.. ఎవరూ మాట్లాడేది। పద్మారాణి లేదా. ఫిటింగూ ఆహా। బాగా గొడవగావుందా। అసం రాళ్లేస్తున్నారా, సరే। పద్మారాణి రాగానే చెప్పు (ఫోన్ పెట్టేస్తుంది) ఏమిటో సిద్ధాంతిగారూ రోజులు బాగోలేవు

సిద్ధా। సత్యము పలికితిరి

ఉష। లేకపోతే చూడండి పోలీసు కాల్పులకు నిరసనగా కాలేజి కుర్రాళ్లు ఊరేగింపుగా బయల్దేరి షాపులు మూసెయిస్తున్నారట బస్సుల మీద రాళ్లేస్తున్నారట ఏమిటో అన్నీ ఈ కుర్రకారుతో గావాలి। అదేమి నిలబడే వున్నారు కూర్చోండి

సిద్ధా। మనస్సు గతి తప్పియున్నది తల్లీ

ఉష అరె ఏమైంది వంట్లో బాగుందా।

సిద్ధా। ఆ పరమేశ్వరుని అనుగ్రహమువల్ల నా దేహస్థితికి ఇంచెత్తు లోపములేదు కాని మనస్సే రోగగ్రస్తమైనది

ఉష। చెప్పండి నేచేయగలిగిందేమైనా వుంటే తప్పక చేస్తాను

సిద్ధా। తల్లీ మా పెద్దల్లుడు అతి యోగ్యుడు దైవచింతన, మీదు మిక్కిలి పాపభీతియున్నూ గలవాడు అతనియందు ద్వేషభావము గలిగిన కొందరు ధూర్తులు, లంచగొండియని, నేరము మోపి, మహాజర్లుపరచి, ఉద్యోగము లాగివేయుటకు ప్రయత్నించుచున్నారని మా కుమార్తె వ్రాసినది,

ఉష అరెరె! అలాగా!

సిద్ధా మా కొమార్తెకు అధిక సంతానమువల్ల అనారోగ్యము కలిగినది ఆ రోగ నిదానము నిమిత్తము మా అల్లుడు ఋణము గ్రహించె నట అదిగో అది ఋణముగాదు లంచము అని గిట్టనివారు గోలచేయుచున్నారట నిప్పు రాజుకొని హనుమంటగా మారి ఆ కుటుంబము నాశనము గాకమునుపే తమరు అనుగ్రహించ వలె। తా నహాయముచేసిన, తమ గోత్ర నామములు చెప్పుకుని త్రికాలములయందు యింటిలో దీపము పెట్టుకొనియెద

ఉష అలాగే

సిద్ధా మా అల్లుని నామదేయము గణపతి ఉప తహశీల్దారు,

ఉష మీకొచ్చిన భయమేమీ లేదు వెళ్లిరండి

సిద్ధా దాహార్తికి పంచామృతము ఇచ్చినట్లున్నది తమ మాట తల్లి మా కుమార్తె ఉత్తరము వచ్చిన నాటినుండి

కూరలు నోటికిన్ రుచులు గూడుట తప్పెను, దుంప కూరలుం

గారముతోడి పచ్చడులు, గన్నుని తేనెలు చేదులయ్యె గం

గారమె చిత్తమంతయును, గంటికి నిద్రవహింపదయ్యె॥"

తమరు అనుగ్రహించవలె।

ఉష। సిద్ధాంతిగారూ। మీరింతగా చెప్పాలిటండి, తప్పక సహాయం చేస్తా

(బయటనుండి హరిరాం, బంగారాజు ప్రవేశం)

సిద్దా। ఏమి నా భాగ్యము। సూర్యచంద్రులు ఒకేసారి ప్రత్యక్షమైనారు దయచేయండి

బంగా। ఉషాదేవిగారూ కూర్చోటానికి టైంలేదు ఈ ఫాయిలు మీద మీరు సంతకం చేయాలి।

ఉష: ఏమిటది?

హరి: మేడం శ్రీకృష్ణస్వామి అనుగ్రహం. రాజాగారు ఐదెకరాల పొలం, ఆదేస్థలం మా ఆశ్రమానికి వ్రాసి ఇచ్చారు

సిద్ధా: రాజాగారు కరుణాసముద్రులు వారికి అనుగ్రహం కలగాలేగాని హారాలు, అగ్రహారాలు కుడిఎడమ అన్న భేదం లేకుండా ఇవ్వగలరు

ఉష: మీకు తెలియదా? మీ స్థలంలో వున్న గుడిసెలు తీసెయ్యాలని ప్రయత్నిస్తుంటగా, గొడవజరిగి పోలీసులు కాల్పులుజరిపారట.

రంగా: నిజమా? ఏమండీ హరిరాంగారూ, మీకేమన్నా తెలుసా

హరి: తెలేవారు మీరు నేను నిన్నటినుంచే తిరుగుతున్నాంగదండీ.

రంగా: అదమ్మా సంగతి.

ఉష: హోటల్ కట్టే ప్లాన్ ఏమైంది.

రంగా: అనుకున్నాను మొదట కానీ

హరి: శ్రీకృష్ణస్వామికి వారిపై అనుగ్రహం కలిగింది అంతే అర్ధరాత్రి పరిగెత్తుకు వచ్చారు వచ్చి హోటల్ దేనికి, ఎవరికోసం అయినా ఈ ఆడంబరాలు మనలాంటి బీదదేశానికి అనవసరం కావాల్సింది ప్రజలకు శాంతి. ఆధ్యాత్మిక చింతన అన్నారు

సిద్ధా: ఆహా రాజాగారిది దొడ్డమనసు అందరూ నా చిన్న పొట్టకు శ్రీరామ రక్ష అనుకునే ఈ కలికాలంలో, వారికి ఇంతటి ఉదాత్తమైన ఆలోచనకలగటం గొప్ప సంగతి రాజాగారి లాంటి వారుండ బట్టే, ఈ దేశం యింకా ఇలా బ్రతికి బట్ట కట్టగలుగుతున్నది

రాజా: సిద్ధాంతిగారూ, ఏమిటో పెద్దవారు, పండితులు తమరూ ఆకాశానికి ఎత్తుతుంటె, నాకు సిగ్గుగా వుంది నేనెంత ఏపాటి వాడి చరాచర జీవకోటిలో నా ఉనికెంత, ఏమిటో,

బంగా హరేరాంగారూ సిద్ధాంతిగారు అలా వుంటారు గానీ వారి విద్వత్తు అల్పో దిప్పటం నావల్లగాదు అవునూ - కృష్ణ మందిరంలో నిత్యపూజలకు సిద్ధాంతిగారిని ఉండమని అడగండి వారి నిత్య ఖర్చులు అయ్యేదబ్బు నేనిచ్చుకుంటాను

సిద్ధా। అంతా భగవదనుగ్రహం

బంగా। ఇన్నాళ్ల సిద్ధాంతిగారికి నేనేమీ చెయ్యలేక పొయ్యాను ఇదో అవకాశం నాకు ఏమంటారు హరేరాంగారు

హరె అవశ్యం వారు అంగీకరిస్తే లేనిదేముంది

సిద్ధా ఎంతమాట రాజాగారు యిదిచెయ్యి అని ఆజ్ఞాపించిన కాదనుట నాకు శక్యమే

హరె, అమ్మా మీదే ఆలశ్యం

బంగా। హరేరాంగారూ ఆమెను ఆలోచించుకోనీయండి మరోగంటలో ఇటువచ్చేటప్పుడు కాగితాలు తీసుకెడదాం లేవండి

ఉష రాజాగారూ కూర్చోండి। కొంచెం డ్రింక్స్ తెప్పిస్తాను

బంగా। తప్పదంటే అలాగే కానివ్వండి అవును సిద్ధాంతిగారూ తిరికిలే అతకదంటారు నిజమేనా?

సిద్ధా। అంటే తమ ఆంతర్యం శెలవియ్యండి।

రాజా। సిద్ధాంతిగారూ నాకు లేనిదేముంది, మీదయవల్ల భగవంతుడు అన్నీ ఇచ్చాడు. పోతే ఉషాదేవిగారిలాంటి సంస్కారవంతులతో వియ్యమందాలని కోరిక ఇది అత్యాశకాదుకదా

సిద్ధా ఎంతమాట మీరు లక్ష్మీపుత్రులు, ఉషాదేవిగారు సరస్వతీ ప్రసన్నులు ఉభయులు వియ్యమందటం, ఆహా ఏమి దైవ సంకల్పం

రాజా మీరామాత్రం ధైర్యం ఇస్తేచాలు। ఇంతకాలం ఆలోచిస్తున్నాను మనసులో మాటచెబితే ఎవరన్నా నవ్వుతారేమోనని అమ్మయ్య ఇన్నాళ్లకా గుండె బరువు తీరింది

రాజా: అప్పు మీకు లోకజ్ఞానం అస్సలు లేదండీ వారు చూస్తాం అంటే చేస్తాం అని కానియ్యండి ఉషాదేవిగారూ ఇవ్వండి కాగితాలు

(ఉషాదేవి కాగితాలు తీసుకు సంతకం పెడుతుండగా PK స్వామి ప్రవేశం ఆ వెనుక వెంకటయ్య)

ఉష: హలో డియర్ ఏమిటి సంగతులు

స్వామి: (అందర్నీ కలియచూసి) రాజాగారూ మీరు చేసిన పనేమీ బాగోలేదు

రాజా: రాగానే నిష్ఠూరమేస్తున్నారు సంగతి చెప్పకుండా!
(వెంకటయ్య బయటకు వెడతాడు)

స్వామి: మీ స్థలంలో గుడిసెలు బుల్‌డోజర్లుపెట్టి కూలగొట్టారు జనం ఎదురు తిరిగారు పోలీసు కాల్పుల్లో నలుగురు మరణించారు

హరి: హరి! హరి!

స్వామి: ప్రభుత్వం ఈ కాల్పులగురించి న్యాయవిచారణ జరిపించాలని నిర్ణయించింది

ఉష: అంటే, స్థలం రాజాగారిది గదా అందులోంచి అక్రమదారులను తొలగించటం నేరమా

స్వామి: రాజాగారూ ఆ స్థలం మీదా! అలాఅని ఋజువులున్నాయా

రాజా: అలాఅని నిలదీస్తే ఏంచెప్పేది నేను డబ్బిచ్చి కొన్నాను

ఉష: దస్తావేజులు లేవా!

రాజా: ఉండాలి! అవి కనబడటంలేదు

స్వామి: మీతప్పులేదా మీరుపదండి

రాజా: నామీద నమ్మకంలేదా తమకు

స్వామి నమ్మకం వుంచే ఏ లాభం। అయినా మీరు తొందరపడ్డారు కాలేజీ కుర్రాళ్ల రంగంలోకి దిగారు ఇహ మీ ఇష్టం

రాజా మీరు చక్రం అడ్డంవెయ్యాలి

సిద్ధా వారు కరుణాసముద్రులు వారు తప్పక అనుకుందురు

రాజా మరి మళ్లీ వచ్చి తమదర్శనం చేసుకుంటాను

స్వామి రాకండి

ఉష అదేం।

స్వామి నేను రిటైర్ కావాలని వుంది

ఉష అంటె సరిగా చెప్పండి

రాజా। చెప్పండి స్వామిగారూ నావల్ల, నా స్నేహంవల్ల తమకు, తమ పదవికీ, ప్రతిష్టకూ భంగం కలిగేలా వుందా

స్వామి కలగొచ్చు।

రాజా చెప్పుతో మొహానగొట్టారు చాలాథాంక్స్। వస్తా

ఉష। ఆగండి రాజాగారు ఏమండీ ఆయన ఎన్నికల్లో సహాయం చేశారండీ

సిద్ధా। విద్యామందిరాలనిన్నీ సంకల్పించారు

ఉష మీ మనసులో మాట చెప్పండి

స్వామి ఉషా। నన్ను disturb చేయకు,

రాజా। అవసరం తీరాక అల్లుడు అంటరానివాడయ్యాడట। ధన్యో
హరేరాం।

ఉష। రాజాగారూ, ఆయన ఏదో చిరాకులో వున్నారు అన్నీ నేను సరిచేస్తాను మీరు వెళ్ళండి

రాజా: మీరు రమ్మంటే వస్తాను అంతే. (హరేరాం, రాజా వెళతాడు)

స్వామి: ఉషా! కాఫీ కావాలి!

(ఉష లోపలకు వెడుతూ ఆగి)

ఉష: మీరు ఆవేశంలో ఆలోచన వుండదు బ్రాహ్మణుని తలమీద కొట్టారు (వెడుతుంది)

స్వామి: సిద్ధాంతిగారూ! పదవివుంది చూశారూ ముళ్ళ కిరీటం లాంటిది చూసేవాళ్ళకు హోదా అధికారం పటాటోపం మాత్రమే కనుపిస్తాయి కానీ పీటన్నిటివెనుక ఉన్నబాధ, మనస్సును వంచించకుని బ్రతకటం తెలియదు.

సిద్ధా: నిజం బాబూ! మా అల్లుడు ఉప తహశీల్దారుడు. మహాయోగ్యుడున్నూ, దైవభక్తి పెద్దలయెడ భక్తిప్రపత్తులు గలవాడున్నూ అయిననేమి రాచరికపు కొలువు, ముళ్ళకంచెమీది అంగవస్త్రము వలె అయినది తమరు అనుగ్రహించవలె!

స్వామి: ఏమైంది? గట్టికొచ్చిందా!

సిద్ధా: అనే మహాఅర్జీ పెట్టినారు స్వామిగారూ

స్వామి: చూడండి సిద్ధాంతిగారూ, ఉద్యోగంలో నీతి నిజాయితీగా వుండాలంటే చేరినదగ్గర్నుంచి అవుతావుతుమని మేకలు మిత్తులు సంపాయించాలనీ ఉద్యోగం పాడిఆవు అన్న భ్రమతో గడ్డి కొరికితే సాక్షి నేనేం చెయ్యలేను

సిద్ధా: అయ్యా! తమ ఆశ్రితుడను అమ్మగారు అంతావిని తయారు చేశారు

స్వామి: చీఫ్ సెక్రటరీని నేనంత అతగాడు మొగాడు ముంత పోసినా, మగవాళ్ళలా తిరగాలన్నా, అతవాళ్ళ కష్టించుకోగూడదు.

(అప్పటికే ఉష వచ్చింది కాఫీతో)

సిద్ధా: తమరి వాలకము చూచిన మా అల్లుని ఉద్యోగమునకు మంగళ హారతి పాడినట్లే ఉన్నారు

ఉష: సిద్ధాంతిగారూ తమరు వెళ్లండి

సిద్ధా: అమ్మా, త్వమేవశరణం, కాదంటారా ప్రాయోపవేశమేగతి, (వెళతాడు స్వామి కాఫీ త్రాగుతుంటాడు)

ఉష: మిస్టర్ ఏ కే స్వామి

స్వామి: ప్రొసీడ్

ఉష: ఓ యువకుడున్నాడు యం ఏ యూనివర్సిటీ కంతకూ ఫస్టుగా ప్యాసయ్యాడు అయితే ఏం లాభం? డబ్బులేదు హోదావున్న వారి అండలేదు బలాదూరుగా తిరుగుతుంటే రావుబహద్దర్ కనకయ్యగారు చూచి జాలిపడి కనికరించి తనకూతుర్నిచ్చి, ఆమెతోపాటు IAS ఉద్యోగం వేయించారు

స్వామి: ఏమిటి నువ్వుచెప్పేది?

ఉష: మీ ఆటోబయోగ్రఫీ

స్వామి: ఇప్పుడు దేనికి?

ఉష: తొండముదిరి ఊసరవెల్లి అవుతున్నది నిచ్చెన సాయంతో మేడ పైకెగబాకి నిచ్చెనని తన్నుతున్న మూర్ఖుని కథ తెలుసున్నారు

స్వామి: Stop it Don't be silly

ఉష: Dear మీకు కోపంగూడ వస్తుందే, అంటే మీలో పౌరుషం గూడ వస్తున్నదే

స్వామి: ఉషా (దగ్గరగా అంటాడు)

ఉష: అరుపు ఓటమికి చిహ్నం మిస్టర్ స్వామి గుర్తుంచుకోండి ఈ పదవీ, వయసూ తమ స్వంతంకావు "ఈ మెట్టు చేరటానికి

తమరు ఎందరి కాళ్లు పట్టుకుని, ఉచ్చనీచాలు మరచి పైకొచ్చారు అద్దాలమేడలో వుంటూ, రాళ్లు విసరటం మంచిదిగాదు ఎవరి అన్నారా weaker sex అని నన్ను చులకనగా చూసి అధికారం చలాయిస్తే, మీ చరిత్ర సీరియల్‌గా వ్రాస్తా ప్రతి గొప్పవాడి వెనుక, ఓ గొప్ప ఆడది వుంటుంది. మరువకండి

స్వామి అంటే ఎంగిలికూడు తిని ఇంతవాడి నయ్యాననా నీ నమ్మకం

ఉష Yes exactly మీకంటే యోగ్యులూ అర్హతలున్నవాళ్లు చాలా మంది వున్నారు వాళ్లందర్నీ త్రోసిరాజని ఈ పదవి మిమ్మల్నే ఎందుకు వరించిందో తెలుసా

స్వామి నువ్వే చెప్పు

ఉష। మీరు గొర్రెలు పైవాడికి తలవంచుతారు గంగిరెద్దులా

స్వామి నువ్వు చాలా డామేజింగ్‌గా మాట్లాడుతున్నావ్‌?

ఉష। నా అహానికి తెల్పరగిలితే, నా ఉనికికి ముప్పు కలుగుతుంటే, నేపూరుకోను ఎదటివాడు కట్టుకున్న భర్త యినాసరే, కడే పున పుట్టిన బిడ్డయినాసరే understand

స్వామి। అయితే నేనేంచెయ్యాలి?

ఉష। మీరేమీ చెయ్యకర్లు నేచెప్పినట్లు నడుచుకోండి

స్వామి నడుచుకోకపోతే।

ఉష Dear। నడచుకు రాలి। నాకు కొన్ని ఆకాంక్షలు ఆశయాలున్నాయి అవి నాకళ్లముందే కాలి భస్మమై పోతుంటే చూడలేను

స్వామి కానీ ఉషా। ఇన్నాళ్ల నా కెరియర్ గురించి ఆలోచించు భర్తత్వం, మమకారం నా పదవీనాధ్యతలకు అడ్డువచ్చి నన్ను తొంగదీసుకుంటే

ఉష: ఏమీకాదు. నీతులను చూసి, ఎంతమాత్రం చూసి తెరలకండి, ప్రపంచం ధర్మంమీద నడవటం లేదు డబ్బు. అదుంటాలి దాన్ని ఎలాగైనా పొందినవాడిదే అధికారం [illegible] మూను

స్వామి: Ok నీ ఇష్టం. కానీ ఉషా. ఏనాటికైనా నీ ఆశలు, ఆకాంక్షలు, ఆలోచనలు నిన్ను వంచిస్తే, ఆనాడు నన్ను నిందించకు. నాకు కట్టిన కార్యమైనా సంతోషపెట్టాలని నిర్ణయించుకున్నాను అంతే. (డ్రాయర్ లోంచి ఓ ప్లాను కాగితం తీసి) రామరాజ్యం గురించి కలలుకన్న మహాత్మా!

నన్ను క్షమించు నేను అశక్తుడిని అసహాయుడను (తల వంచుకుని కళ్లు తుడుచుకుని) ప్లాను చించబోతుండగా చైతన్య ప్రవేశం వస్తూనే తండ్రిచేతిలో ప్లాను లాక్కుంటాడు)

చైత: డాడీ. ఏమిటి మీరు చేస్తున్నది, ఎన్నోఏళ్లుగా కలలుగని, కలలకు కార్యరూపం ఇవ్వాలనీ రామరాజ్య స్థాపనకు పునాదులు వేసి, ఆ పునాదులపై శాంతి, సౌభ్రాతృత్వం, సర్వమానవ సంక్షేమమనే అంతస్తులు నిర్మించాలన్న ఆశలకు నీళ్ళు వదులుకుంటున్నారా

స్వామి: అవును చైతన్యా

చైత: ఎందుకని

స్వామి: ఎందుకో మనస్సు కీడు శంకిస్తున్నది అసహాయత నన్ను లొంగదీసుకుంటున్నది

చైత: అందుకని-అసలు పథకాన్నే నామరూపాలు లేకుండా చేస్తారా?

స్వామి: అవును చైతన్యా విలువలు మారుతున్నాయి జీవన విధానమూ మారుతున్నది ఇక దీనిని గురించి ఆలోచించే నాథుడు ఎవ్వరూ మిగలరు

చైత। దాని అభివృద్ధి తనతోనే అంతరించి పోతుందని రాజోద్యో గిరాలు అనాగరికంగా బ్రతుకుతాయన్న నైరాశ్యం వదులు కోండి ఈ గాలికి అల వూపిన నాన్నా ఆ ఆశలోంచే రేపటి సూర్యుడు ఉదయిస్తాడు మానవాళికి మరో మహాత్ముడు వస్తాడు అన్న ఆకాంక్షతో బ్రతకండి

స్వామి। అలాగే (వెళతాడు ఇంతవరకూ రికామీగా వున్న ఉష)

ఉష చైతన్యా,

చైత ఏమ్మా

ఉష నాతో మాటివ్వగలవా?

చైత అడుగమ్మా

ఉష। అడిగాక కాదంటే కూడదిక అంటే నేభరించలేను నాకు ముందు మాటివ్వు

చైత సుందరి కాళ్ళకు బంధాలు వేసి పరిగెత్తమంటావా చెప్పమ్మా నీవంటే నాకు గౌరవం నాకు వ్యక్తిత్వ మొచ్చింది దానికి భంగంకాకుండా ఏం చెయ్యమన్నా చేస్తా।

ఉష రాజాగారి కూతుర్ని పెళ్లి చేసుకోవాలి।

చైత I hate money

ఉష అది లేంది బ్రతుకలేవు

చైత। స్త్రీ సుఖమమ్మా జీవితం అంటే, కార్లు మేడలు ఎయిర్ కండి షన్డ్ భవంతులు, సంపెంగ సువాసనలుగాదు నా దృష్టిలో ఇవన్నీ రంగుల వలలు కలలు మనిషిగా బ్రతికేందుకు ఇవన్నీ అడ్డుగోడలు నాకొద్దు ఇవన్నీ

ఉష। నాక్కావాలి।

చైత। అందుకు నేను నీ ధనాన్ని కాలేను స్వచ్ఛమైనగాలి, స్వేద బిందువులు చిగురుటాకులు, చిన్నారి పాపల సస్యాలు,

ఆర్ద్రత, మానవత, మనిషి మనిషి మధ్య అంతస్తులు, అడ్డుగోడలు లేని సమాజం నేకోరుకునేది అక్కడ కులాలు, మతాలు, దోపిడీ, దౌర్జన్యం, ఆకలి, ఆక్రందనాలు ఇవి వుండవమ్మా

ఉష। ఓ మైడియర్ చైతన్యా, నువ్వు మత్తులో వున్నావు ప్లీజ్, నన్ను అన్యాయం చెయ్యకు

చైత లేదమ్మా రోగగ్రస్తమైన సమాజంలో మనమూ అవిటివాళ్ళమైనాము మన ధర్మాన్ని జాతి జీవన సత్యాన్ని వదులుకుని పయనిస్తున్నాము ఆశీర్వదించమ్మా, నేనాశించిన నవ సమాజ సృష్టికి, నన్ను దీవించి పంపమ్మా

ఉష। (ఆవేశం వస్తుంది ఊగిపోతుంది చైతన్య చొక్కా పుచ్చుకుని ఆ చెంపా ఈ చెంపా వాయించేసి) నో-నో నేను ఓడిపోను ఓడిపోలేను (అని ఏడుస్తుండగా లోపల్నుంచి స్వామి ప్రవేశం)

స్వామి ఉషా। ఏడుపు ఓటమికి చిహ్నం

ఉష ఏమండీ।

స్వామి అవును ఉషా నువ్వేడుస్తున్నావంటే నాకు నమ్మ శక్యంగా వటం లేదు అయినా ఇప్పుడేమైందని ఏడవటం Be brave

ఉష లేదండి నాకళ్ళముందే ఆశాసౌధాలు రాలిపన్నమై పోతున్నాయన్న భ్రమకలుగుతోంది ఇది నేను భరించలేను ప్లీజ్। మీరైనా వాడికి చెప్పండి రాజాగారితో వియ్యమందితే వాడి బ్రతుకుబాగు పడుతుందండి చెప్పండి

చైత। అమ్మా వివాహమంటే రెండు జీవాల శారీరక సంబంధంగాదు డబ్బుతో విభిన్నదృక్పథాల స్త్రీ పురుషులను సంయోగపరిస్తే మిగిలేది నిరాశ నిస్పృహ। అవునా డాడీ।

స్వామి। యూ ప్రొసీడ్

చైత: కన్యావరయతే రూపం,
మాతా విత్తమ్, పితాశ్రుతం
కాని అది అనాగరిక ధర్మం మమ్మీ
ఈనాడు కావాల్సింది,
అనుకూలం విమలాంగిమ్
కులజామ్, కుశలాం సుశీల సంపన్నాం
పంచలకారామ్ ధర్మిణ్,
పురుషః పుణ్యోదయావల్లభే-
మనసా వాచా కర్మణా స్త్రీ పురుషుల సంయోగమే వివాహం
అలాంటిదే నే వాంఛిస్తున్నా (వెళ్లబోతాడు)

ఉష: ఆగు ఏమంటి వాడేమంటాడు

స్వామి: (చిన్నగానవ్వి) ఉషా లోకంలో ప్రతితల్లి సంపద కోరుతుంది పడుచు వరుని రూపం వాంఛిస్తుంది తండ్రి కీర్తి కోరతాడు కాని కావల్సింది పవిత్రమైన ఇంటపుట్టి, శీల సంపదకలిగి, అనుకూలవతియైయుండి, సదా భర్త హితః ప్రాణంగా మెలిగేది అర్ధాంగి అలాంటి స్త్రీ భార్యగా కావాలని వాడి అంతర్యం

ఉష: అంటె, అలాంటి వాళ్లు రాజుగారి కూతురు అలాంటిది కాదా!

చైత: అలా అని నే అనలేదే

స్వామి: మిస్టర్ చైతన్యా సర్వే గుణాః కాంచన మాశ్రయంతి, రాజుగారితో వియ్యమందాలని మీ అమ్మ నిశ్చయించుకుంది

చైత: మీరు అలాఅని నిశ్చయించుకున్నారా

ఉష: అవునని చెప్పండి

చైత: చెప్పు డాడీ!

స్వామి: మైడియర్ చైతన్యా! ఉద్యోగంలో చేరినప్పుడు నాచేతిలో పద ఫండ్ అధికారముంది నవసమాజ నిర్మాణం చెయ్యాలన్న

నిజాయితీవుంది కానీ కాలంగడిచేకొద్దీ నే గ్రహించిందేమిటో తెలుసా? నేను నిస్సహాయుడనని, భయం, బెదిరింపులు, తెర వెనుక బాగోతాలు, రాజకీయ వత్తిడులు, ఎలాగోలా అధికారపు అంచులకు చేరి ప్రయోజకుడు అనిపించుకోవాలన్న కోరిక ఇవన్నీ మానవత్వాన్ని నామరూపాలు లేకుండా చేశాయి నేను ప్రస్తుతం కీలుబొమ్మను-క్షమించు

(కర్చీఫ్‌తో కళ్లనీళ్లు తుడుచుకుంటాడు అప్పుడే వ్యాస మూర్తి ప్రవేశము- పరిస్థితి చూస్తాడు)

స్వామి వ్యాసమూర్తిగారు, నామనస్సేం బాగోలేదు- క్షమించండి మరో సారిరాండి (వెళతాడు-వ్యాసమూర్తి తలపంకించి చైతన్య దగ్గరిగా వచ్చి)

వ్యాస చైతన్యా! Be brave, లేవునీదే. ధైర్యంగావుండు (వెళతాడు)

(తెర)

మూడవ (౦)

(రంగాలంకరణలో పెద్ద మార్పేమీ వుండదు ఊరేగింపుగా వస్తున్న జనం కేకలు, నినాదాలు వినపడుతుం టాయి పి కె స్వామి కుర్చీలో కూర్చుని చేతిలో గ్లాసు పట్టు కుని చూస్తు వుంటాడు. వెంకటయ్య హడావుడిగా వస్తాడు)

వెంక! సార్! ఊరట వేలమంది జనం ఊరేగింపుగా వచ్చారు సార్

స్వామి పోలీసులున్నారుగా!

వెంక! ఉన్నారుసార్ కానీ సార్ జనం ఆక్రోశం చూస్తుంటే వాళ్లంతా ఉప్పెనగావచ్చి, ఈ బంగళానే పీకివండేసే వేసేలావున్నారుసార్

స్వామి! జనం ఆవేశం లాటూసు మంటలాంటిది నీకోకథ చెప్పేదా?

వెంక ఇప్పుడాసార్, బయట,

స్వామి: వెర్రి వెంకటయ్యా రాజాగారు కురవమంటే వానలు కురవలేదు కాలాన్నిబట్టి వానలు కురిశాయి ఎన్నోఏళ్ల కరువు కాటకం తర్వాత పంట పండింది నీలాంటి వెర్రిజనం అంతా రాజాగారి చలువే అనుకున్నారు చూడు బయటకువెళ్లి పోలీస్ కమీషనరుతో ఆ ఊరేగింపు నాయకులలో ముఖ్యుల్ని లోపలకు పంపమను. వెళ్లు

(వెంకటయ్య వెడతాడు బయటనుండి కేకలు, ఈలలు, నినాదాలు వినపడుతుంటాయి.)

లంచగొండితనం - నిర్మూలించాలి
నిత్యావసరవస్తువులు - చవకగా సరఫరా చెయ్యాలి
నిరుద్యోగులకు భృతి ఇవ్వాలి
కాగితపు డిగ్రీలు - వద్దువద్దు.

(పి కె స్వామి నినాదాలు విని నవ్వుకుంటుంటాడు ఉషాదేవి బయటనుంచి హడావుడిగా వస్తుంది)

స్వామి: ఎక్కడో మీటింగుందని బయలు దేరితివిగా

ఉష: బంగళాముందంతా జనం కారుపోయ్యే వీలులేదు అయినా మైడియర్ ఈ జనమేమిటి ఇలా మరీ బరి తెగించారు, ఆ బయట వున్న జనం చొక్కాల్లేవు, కొంతరికి చెప్పుల్లేవు. నల్లగా అబ్బబ్బ ఈ అలగాజనం మరీ పేట్రేగి పోతున్నారు

స్వామి: కరెక్ట్! కానీ ఉషా! వాళ్లు సాత్వికులు అందుకే స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఆశగా చూస్తున్నారు, పరాయిపాలన పోయింది పరమాన్నం వడ్డన జరుగుతుందని- కానీ ఏం లాభం? రైతు, కూలీ అవుతున్నాడు, కూలీ ముష్టాడవుతున్నాడు

ఉష: అంటే ఏమిటి మీరనేది? ఇన్నాళ్లల్లో ప్రగతి సాధించలేదామనం?

స్వామి: అయ్యో! ఎందుకు సాధించలేదు స్వాతంత్ర్యం రాకముందు పాతఅప్పు ఆ [illegible] ఒక్కడే దోచుకునేవాడు ఇప్పుడో

యథాశక్తి మనలను మనమే కాచుకుంటున్నాం సర్లే నువ్వు లోపలకు వెళ్లు

(తను వెడుతుండగానే బయటనుంచి హరిశ్చంద్రుడు- ఆ వెనుక బ్రహ్మానందం వస్తారు ఇద్దరి ముఖాన కుంకుమ బొట్లు, మెళ్లో దండలూ వుంటాయి వాళ్ల వెనుక వెంకటయ్య వస్తాడు స్వామి లేచి ఇద్దరకూ నమస్కరించి)

స్వామి రాండి। రాండి। కూర్చోండి —వెంకటయ్యా అందరకూ డ్రింక్స్ తీసుకురా।

హరి ఏళ్లేదు మా సమస్యలు పరిష్కారమయ్యేదాకా మంచినీళ్లు ముట్టుకోం।

బ్రహ్మ: అంటే ముందు చర్చలు ఆ తర్వాత పానీయాలు.

స్వామి: ప్రభుత్వం మీ సమస్యలను సానుభూతితో పరిష్కరించాలన్న కృతనిశ్చయంతో వున్నది పౌర-హరిశ్చంద్రుడు గారూ మీరు రాజకీయాల్లో తలపండిన వారు, ఎన్నో యుద్ధములలో ఆరితేరిన రాష్ట్రనాయకులు మీరూ రాకరాక వచ్చారు, కనీసం నా ఆతిథ్యం తీసుకోకపోతే, నా మనసెలాగో వుంటుంది,

హరి: తప్పదా,

స్వామి తప్పదు వెంకటయ్యా అమ్మగారిని డ్రింక్స్ తీసుకురమ్మను.
(వెంకటయ్య వెడతాడు)

హరి మీరు బ్రహ్మానందంగారిని గ్రామీణ ప్రజల ప్రతినిధి

ా వారు నాకు తెలి యక పోవడమేమిటి, మీరు తెలియచేయాలా నా బావగారు

బ్రహ్మ ఇదిగో టిప్పెస్కెటుగారూ- నమస్కారం, నేనిక్కడకు వచ్చింది మర్యాదలు పొ ,ెందటాని అందుకోటానికిగాదు అయినా

ఇప్పుడు చుట్టరికాలు, బంధుత్వాలు అనవసరం ప్రేమలు-ప్రభుత్వం అంతే

స్వామి అలాగే మీ సమస్యలు ఏమిటో వివరిస్తూ ఏమన్నా మహజర్లు తెచ్చారా?

బ్రహ్మ ఇదివరకు పంపాం।

స్వామి పంపారు అవి ప్రభుత్వానికి అందాయి మీరు ప్రస్తుతం తెచ్చారా। ఏమండి హరిశ్చంద్రుడుగారూ।

హరి। తేలేదండి బ్రహ్మనందగారూ పోనీ ఓ నకలు మనవాళ్ల దగ్గరుందేమో తెస్తా

స్వామి వద్దు సముఖాన రాయిస్తారనూ। మీరొచ్చారు చాలు అయినా వెనకబడిన తరగతుల అభివృద్ధికి, వాళ్ల సమస్యలను పరిశీలించి సూచన లివ్వేందుకు ప్రభుత్వం ఓ కమిటీ వెయ్యాలని నిశ్చయించింది అందుకు మిమ్మల్ని అధ్యక్షులుగా వెయ్యాలని మీ అంగీకారంకోసం ఉత్తరం వ్రాశాం చేరిందా।

హరి। లేదండి

స్వామి గాలి హరిశ్చంద్రుడు మీరేగదా మర్చిపోయానండి బాబూ బ్రహ్మానందగారూ, మీ అడ్రస్ మావాళ్లకు తెలియలేదండి బాబూ మీరెళ్లేప్పుడు మీ అడ్రసివ్వండి ఏం?

హరి। అలాగే సార్

బ్రహ్మ ఈ హుటాహుటిగా నేనిలా। మా గురించి, షెంపదిప్పిన పనిగురించి మాట్లాడేదేమైనా వుందా।

స్వామి బ్రహ్మనందంగారూ అల తొందరపడితే ఎలాగండీ ఏమండి హరిశ్చంద్రుడుగారూ

బ్రహ్మ అయ్యా పిల్లికి చెలగాటం ఎలుక్కు ప్రాణసంకటం అనీ మా బాధలు మీకు తెలియవండి

స్వామి తలవారే క్యాబినెట్ హోదా అంటే బాబూ, ఎంతోమంది శాసన సభ్యులను గాదని పెద్దాయన మిమ్మల్ని ఎన్నిక చేశారు అసలు ఆయనకు మీరంటే చాలా గురండి

హరి అవునుసార్ అసలు ఆయన వచ్చాకేగదండి ఎన్నో ప్రారంభోత్సవాలు శంకుస్థాపనలు జరుగుతున్నాయి సార్ అఖిల భారత వెనుకబడిన మహాసభలు జరిపి, పెద్దాయన్ని ప్రారంభోత్సవానికి పిలుస్తా

స్వామి వెరీగుడ్

హరి। అసలు నన్నడిగితేసార్ వెనుకబడిన కులాల మహాసభలు, ప్రతిదేశంలోను ఏర్పాటు చేసి దీన్ని మహా ఉద్యమంగా ఏర్పాటు చేయ్యాలి సార్

బ్రహ్మ (ఇంతవరకూ అసహనంగా కూర్చున్న వాడల్లా) హరిశ్చంద్రుడు గారూ మనం వచ్చిన పని మరచి, మీరేవేవో మాట్లాడుతున్నారు మాన్యంత విషయాలు మాట్లాడు కోదలిస్తే నేవెళతాను

స్వామి। బ్రహ్మానందంగారూ, గాంధీగారు శాంతమే ప్రధానం అన్నారు ప్రజల సమస్యల గురించి మాట్లాడేటప్పుడు ఆవేశం పనికిరాదు ఏమండీ,

హరి అంతేసార్—అయినా బ్రహ్మానందంగారూ వారు పెద్దవారు ఏదోచెబుతున్నారు మీరూ తొందర పడితే ఎలా।

బ్రహ్మ నేను తొందర పడ్డానా। లేదు ప్రజాబంధుగారూ। మౌన పోయ్యాను అంతె సరె కానివ్వండి

స్వామి ఆల్‌రైట్ పెద్దాయన అనగా మన ప్రియ తమ నాయకులు, అన్ని అధికారాలు నాకిచ్చి, మాతో సంప్రదింపులు జరుప మన్నారు,

హరి: ముఖ్యమంత్రికీ జై

స్వామి: పోతే, సమస్యలు పరిష్కరించు కోవాలంటే శాంతియుత వాతావరణం వుండాలి ఆవేశాల్లో నిర్ణయం తీసుకోగూడదు ఎందుకంటే, మీకు తెలుసు ప్రపంచంలో అశాంతికి మూలకారణం అగ్రరాజ్యాలు అభివృద్ధి చెందుతున్న మనలాంటి దేశాలు ఉద్యమాలను భరించలేవు పోతే మువ్వయ్యేవ ప్రణాళికా కాలంలో వూరికో బావి ఇంటికో దీపం, మనిషికో ఉద్యోగం, కుటుంబానికో ఆవు లేదా గెదె లేదా కోడిపుంజు ఇవ్వాలని నిర్దేశించారు

హరి: శహబాష్

స్వామి: రోడ్ల నిర్మాణానికి మూడు పాయింట్ అయిదు ఆరోగ్యానికి ఏడు పాయింట్ ఏడు, గృహవసతికి జీరోపాయింట్ ఏడు ఒకటి ఏడు, విద్యుతు తొమ్మిది పాయింట్ల కోట్లు కేటాయించాలని ప్రభుత్వం కృత నిశ్చయంతోవుంది వీటన్నిటినీ పరిశీలించేందుకు క్యాబినెట్ సబ్ కమిటీ ఏర్పాటు చేశారు.

హరి: స్వామిగారు మన ప్రభుత్వం, ప్రజల సమస్యలపట్ల ఇంత ఉదారంగా వున్నందుకు నాకెంతో మహదానందంగావుంది. ఏం బ్రహ్మానందం

బ్రహ్మ: వారుచెబుతున్నారు వినూ

హరి: అలాగే సార్ కానివ్వండి

స్వామి: గాంధీగారు కలలుకన్న రామరాజ్యం, అంతా కాగితాలమీద రానీపెట్టాం అమలు పరచటమే లక్ష్యం అందుకు ముఖ్యంగా ప్రజల తోడ్పాటు అవసరం మీరు ఉద్యమాలు, ఆందోళనలు విరమిస్తే

హరి: సార్ అఖిలపక్ష ఆందోళన కమిటీ చైర్మన్‌గా, ఆందోళన తక్షణం విరమిస్తున్నాను అంతేగాదు ప్రభుత్వానికి న పూర్తి మద్దతు ప్రకటిస్తున్నాను ఏం బ్రహ్మానందం

బ్రహ్మం (మాట్లాడడు)

స్వామి మీ ఉద్యమానికి ముఖ్యులెవరో, వారు నమ్మి విరమిస్తున్నట్లు ఆందోళనకు స్వస్తి చెప్పి, ప్రభుత్వంవారు అమలు జరుపుతున్న అభివృద్ధి కార్యక్రమాల విజయానికి తోడ్పడాలని నిశ్చయించి నట్లు సంతకం చేయండి

హరి నేను ఎవరేది ఇవ్వండి. (కలం తీసుకుని బొటన వేలికి సిరా రాసుకుని వేలిముద్రవేసి) మీ యిష్టం ఆ పైన ఏం రాసుకున్నా సరి ఇప్పుడే వెళ్లి, బయట జనానికి, పత్రికలవాళ్లకి ప్రకటన ఇస్తా రా బ్రహ్మం

బ్రహ్మం (నేది చాలా సీరియస్‌గా పోటోయి ఆగి హరిశ్చంద్రుడి మొహాన తుపుక్కున ఉమ్మి) ఛీ! కుక్కవని తెలియక నీ తోక పట్టుకున్నా

హరి, నేను కుక్కనా!

బ్రహ్మం! కుక్కకు విశ్వాసముంటుంది నీతో ప్రభుత్వం పారేసిన పదవనె ఎముకకు ఆశపడి ప్రజా ఉద్యమానికి నీళ్లుధారపోశావు ఛీ! చూస్తా ఈ ఉద్యమం ఎలా ఆగుతుందో చూస్తా (వెళతాడు)

హరి! అవ్వెవ్వె! వీళ్లకు రాజకీయం తెలియదండీ మోటు మనుషులు పట్టిందే పట్టు! సార్ వస్తా! నా కాగితం

స్వామి! రేపు! (హరిశ్చంద్రుడు వెళతాడు ఆతను వెళ్లాక స్వామి చిన్నగా నవ్వుకుంటాడు ఫోన్ ఎత్తి డయల్ చేసి ఎవరితో ఏదో చెబుతుండగా బయట "నాదాలు ఆర్భా" స్వామి ఫోన్‌లో చెప్పేది వినపడదు)

ఉష (ప్రవేశం) కంగ్రాట్స్!

స్వామి దేనికి

ఉష ఇద్దరు నాయకులమధ్య విభేదాలు సృష్టించి ఉద్యమం నడ్డివిర గ్గొట్టాడు మంచిపని చేశావు వెధవ నక్షత్రకాయ బ్రహ్మానందం పోయాడూ కారా. పెద్దప్రజానాయకుడిలా ఆ మాటలు మంచిగా స్తి చేశారు

స్వామి. ఉషా. నే చేసినపనికి నిజంగానే హర్షిస్తున్నావా.

ఉష. అవునండీ ఇప్పుడు నిజంగా చీఫ్ సెక్రటరీలా ప్రవర్తించారు Be Brave. ఇలాగే, సంఘవిద్రోహుల ఆటకట్టించి శాంతి నెల కొల్పండి

స్వామి అలాగే చూసు నేవెళ్లి రెస్ట్ తీసుకొంటాను సిద్ధాంతిగారొస్తే చెప్పు వాళ్ల అల్లుడు గణపతిని ఉద్యోగంలోంచి తీసేసారని చెప్పు (మెరుపులా వెళ్లిపోతాడు లోపలకు ఉష stale అయి నిలబడి పోతుంది తేరుకుని లోపలకు వెళ్లబోతుండగా బయటనుంచి హరేరాం ప్రవేశం)

హరే మేడంగారు ఇక్కడే వున్నారే. చూడమ్మా మీ అయ్యగారి వరుస ఏంబాగోలేదు మీమొహంచూసి వూరుకోవల్సి వస్తున్నది

ఉష ఏం జరిగిందండీ- రాండి కూర్చోండి.

హరే నే కూర్చోటానికి రాలేదు హెచ్చరించి పోదామని వచ్చాను

ఉష. అసలేం జరిగిందో చెప్పండి.

హరే మీ అయ్యాయి ఓ గుంపునేసుకొని వచ్చి, మా కృష్ణమందిరం ముందు పికెటింగ్ జరిపాడు అంతేగాదు దేశదేశాలనుంచి వచ్చిన మా శిష్యులను అవమానపరచి దేశంనుంచి వెళ్లిపొమ్మని బెదిరించాడు మా వాళ్లందరినీ భయభ్రాంతులను చేశాడు ఏమ్మా, శక్తికోసం ముక్తికోసం, తన్నవాళ్లను, మాతృభూమిని అన్నీ పొస్తులేన్ని వదులుకుని వచ్చినవాళ్ల దేశద్రోహులా.

ఉష హరేరాంగారూ, ఈకాలం కుర్రాళ్లకు ముందేదో వెనకేదో తెలి యదు [illegible] సంస్కృతి తెలియదు వెర్రి ఆవేశం అంతే.

హరి। మేడంగారూ। ఆవేశం కాదమ్మా యిది దీనివెనుక నాస్తికులు, విప్లవకారులూ (కమ్యూనిష్టులూ) వున్నారు ఆ కుట్రలో భాగమే యిది దీన్ని అరికట్టకపోతే ముందుముందు దేశానికేగాదు ఈ జాతికే ప్రమాదం ఆ ప్రమాదం రాకుండా చూసుకోవడం ఎలాగో నాకు తెలుసు కాకపోతే మీకు చెప్పడం నా విధి చెప్పాను ఆ తర్వాత మీ యిష్టం।

(అంతకుముందే చైతన్య వచ్చివున్నాడు పోతోతూ హరేరాం చైతన్యను చూశాడు)

చైత। హరేరాంగారూ। మీరు చెప్పదల్చుకున్న దేదో నాకే చెప్పండి

ఉష చైతన్యా।

చైత। మమ్మీ ఆయన నేరారోపణ చేస్తున్నది నామీద, అందుకు సమాధానం, సంజాయిషి చెప్పుకోవాల్సిన బాధ్యత నాది

ఉష। నో। హరేరాం అంటే నాకు గౌరవం ఆయన్ని అవమానించడం నేను సహించను

చైత। నేను నీ కొడుకును నన్ను నిర్దోషిగా చూడటం నీ బాధ్యతగదా।

హరి। నే వెళ్లొస్తానమ్మా

చైత। ఆగండి, హరేరాంగారూ। నేను నాస్తికుణ్ణిగాదు విప్లవకారుణ్ణి (కమ్యూనిష్టుని) అంతకన్నాగాదు నావల్ల ఈ దేశానికి, ఈ జాతికి కలిగే హానేమిటో చెప్పండి

హరి। తప్పదా।

చైత మీరు పిరికివాళ్ళు, పలాయన వాదానికి దాసులూ కాకపోతే చెప్పండి

హరి। సరే అయితే మీరు దేవుడున్నాడని నమ్ముతారా।

చైత। వున్నాడు అయితే నే నమ్మే దేవుడు పాలరాతి మందిరాల్లోనూ, అష్టైశ్వర్యాల, [illegible] రాతే [illegible], రాగూడదనిగోట మాత్రం

లేదు. ఈ దేశంలోని కోటానుకోట్ల మానవుల్లో వున్నాడు తల్లి, తండ్రి, గురువు వీళ్లే నా దైవాలు నాకు మానవుడే మాధవుడు

హరి ఈ పిడివాదానికి మూలం,

చైత మెటీరియలి (కమ్యూని)జం మాత్రంగాదు మానవతావాదం అంటె కడుపునిండినవాడికి దేవుడుకావాలి కండబలిసినవాడికి కాముకత్వం కావాలి అంతేగానీ దేవుడనే మత్తుమందూ ఖర్మనే అవతారవాదమూ నేను అంగీకరించను

హరి విన్నారా! విన్నారా! యింతకంటె నాస్తికత్వం ఏముంది? చెప్పండమ్మా అంటె మేమంతా కడుపునిండి, దేవుడిని స్మరిస్తున్నామా!

చైత అవును సోమరిగా బ్రతికేందుకూ, మానవ బలహీనతల పై సొమ్ముచేసుకునేందుకే మీకు దేవుడు అవసరం లేకపోతే ఈ నామసంకీర్తనలు, ఉత్సవాలూ, ఊరేగింపులూ దేనికి? ప్రచారం మతం మార్పిడి ఇవన్నీ బూర్జువా రాజకీయాలు I hate it

హరి శుద్ధ వెధవలతో నేమాట్లాడను

చైత నే మాట్లాడతాను,

ఉష చైతన్యా- I say you get out

చైత వెళతానమ్మా వెళదామనే నా ఆలోచన కాకపోతే ఏదారంట వెళితె గమ్యం చేరతానో తెలియటం లేదు (బయటకు పోతుం డగా లోపల్నుంచి స్వామి ప్రవేశం)

స్వామి ఏమైంది?

ఉష తమ సుపుత్రుడు —ఎలా చెప్పాలో తెలియటంలేదు కానీ ఇలా చూస్తూ ఊరుకుంటే వాడు (నక్సలైట్ గా) వేగ నాంచ్ (గానో మారాడు Yes-That is Certain

స్వామి: ఓ-వైరటస్య, నంగతేనా: I Like him వాడిని చూస్తుంటే నా చిన్నప్పటి రోజులు గుర్తు కొస్తాయి నేనూ అంతే, కాకపోతే వాడు చప్పగలుగుతున్నాడు బయటకు.

హరి: అంటె తమరు

స్వామి: నో, నో। నేనెవర్నీ సమర్థించడం లేదు ప్రధాన కార్యదర్శిని- అంటె అన్నిటినీ చూడటం వరకె నావని।— Leave it-అ చెప్పండి హరేరాంగారూ।

హరి: ఏం చెప్పమంటారుసార్। ఈ ధ్యానానికి, మానుందరానికి రక్షా లేకుండా పోయింది

ఉష: అవునండీ ఎంతో చదువుకుని, ఇది కాదు దారి అని తెలుసుకుని కర్మభూమికి ఎదిగ్చిన వెళ్లని రావడటం మాపధింది

స్వామి: కరెక్ట్-పూర్వం గోవుల్ని, బ్రాహ్మణులని కాపాడటం రాజ ధర్మం అలాగే నేడు కూడ ఉత్సవాలు జరగాలి తిరిగిం పులూ, నైవేద్యాలూ యధావిధంగా జరగాలి జరుపు ...

హరి: చాలు తమ లాంటి వారు ధర్మ రక్షణ చేస్తూవుంటే అంతకన్నా కావల్సిందేముంది అలాగే రాజాగారు దానమిచ్చిన స్థలం మాకు దఖలు పరిస్తే-

ఉష: అప్పుడండీ నాహాయాంలో, ఆ మందిర నిర్మాణం పూర్తయితే చాలు।

హరి: అవును తమ పుణ్యాల కట్టుకోండి మీ దంపతులిద్దరు మా ఖర్చు మీద వరల్డ్ టూర్కు పంపుతాం।

స్వామి: Sure Sure। రానీ అసలా స్థలం రాజాగారిదేనా అన్న, తేం లేదు

హరి: మీరు తేల్చాలి। రాజాగారు అబద్ధమాడరు

ఉష: కరెక్ట్. ఆయన కా అవసరంగూడలేదు అయినా మీరు మరీ రూల్ మైండెడ్‌గా వుండకూడదు అయినా రూల్ అంటే ఏమిటి? సవరించుటకు వీలైనదీ అనేగా? ఏమంటారు

స్వామి కరెక్ట్. అయితే మా దంపతుల ప్రపంచయాత్ర

హరి: నే ఏర్పాటు చేస్తాను ప్రపంచం అంతా తిరిగొద్దురుగాని.

ఉష ఆహా! నా చిరకాలవాంఛితం నెరవేరుతున్నదన్నమాట.

స్వామి: ఆల్‌రైట్ మీరు నిశ్చింతగావుండండి Dear ఉషా! మా యిద్దరికీ డ్రింక్స్ తేరాదూ

ఉష ఇప్పుడే. నాకివ్వాళ ఎంతో సంతోషంగావుంది (వెళుతుంది)
(బయటనుంచి బంగార్రాజు-సిద్ధాంతి ప్రవేశం)

స్వామి రాండి. రాండి. ఉషా (కేకేసి) ఉండండి మీకు డ్రింక్స్ తెమ్మని చెప్తాను (లోపలకు వెళతాడు)

హరి రాజుగారూ! స్వామిగారు ఒప్పుకున్నారు

రాజు దేనికి

హరి అదే. తమరు మా సమాజానికి దానంచేసిన స్థలం దఖలు పరచటానికి

రాజు నాకు తెలుసు

హరి మీకు ముందే తెలుసా! ఎలా?

రాజు: మళ్ళీ ఎక్కడా అనబోకండి-పెద్దాయనతో చెప్పేము పదవిలో వుండాలని వుంటే నా జోలికి రాకు! అని

హరి అయ్య బాబోయ్! నిజంగా అలాగే అన్నారా!

రాజు అహా! ఎవడు పదవి కావాలనుకున్నా, పదికాలాలపాటు బ్రతకాలన్నా, బంగార్రాజు చల్లని చూపు కావాలండీ

(స్వామి ప్రవేశం)

స్వామి! రాజుగారు చాలావంగా వున్నారు

రాజు అబ్బెబ్బె! మన సిద్ధాంతిగారు మీతో మాట్లాడదామని వచ్చారు

స్వామి! పాపం! వారికేం సహాయం చెయ్యలేక పోయాను. అందుకు బాధగావుంది

సిద్ధా తమరు తలచుకున్న కానిదేమున్నది

స్వామి సిద్ధాంతి గారూ! వెనకటికి మీలాంటివాడే ఓ రాజుగార్ని, మీ మాటగాదు యింతపొడవు కత్తి నడుముకు పెట్టుకున్నావ్ గడ్డంగీయలేవా అన్నట్లు! అలాగే పేరుకు పదవి పెద్దదేగానీ నా వెనుక వ్రాయించేది, నడిపేది! నడిపించేది వేరేవాళ్లు

రాజు! స్వామిగారు వినుకున్న రాయి నామీదకాదుగదా

స్వామి అయ్యబాబోయ్! అంతధైర్యమేనాకు పదవి కావాలనుకుంటే, పదికాలాలపాటు బ్రతకాలంటే, తమరి అనుగ్రహం కావాలంటి.

రాజు! జోక్ చేస్తున్నారు

సిద్ధా! అయ్యా! మీరంతా అన్నిటా పెద్దవారు మీరు అనుగ్రహించవలె! మా అల్లుని ఉద్యోగము నిలుపవలె!

(ఉషాదేవి డ్రింక్స్‌తో ప్రవేశం)

స్వామి తీసుకోండి!

(సిద్ధాంతి తప్ప అందరూ తీసుకుంటారు)

సిద్ధా తల్లీ- తమరు మా అల్లుని ఉద్యోగము ఇప్పింతునని మాట ఇచ్చితిరి దానిని నిలబెట్టు కొనవలె! లేదా నేను ప్రాయోప వేశము చేతును

స్వామి ఉషా! ఏమిటి యీ గొడవ-

ఉష! సిద్ధాంతిగారు మనకు ఆప్తులండి.

స్వామి: అయితే, ప్రాయోపవేశాలు, ధర్మాలు చేసే నిరాహారదీక్షలూ శాస్త్రసమ్మతమవుతాయా? ఆ కాలం ఎప్పుడో పోయింది. నేను పేదవాణ్ణి సహిస్తానుగానీ అంధగొంతితనం అస్సలు సహించను. ఏమంటారు రాజాగారు

రాజా: ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య-

సిద్ధా: అయ్యా! బంగారురాజాగారు, తమరు మాటలతో రానీయకండి. నా ఉపకారము చేయు సదుద్దేశ్యముతోనేగదా ఇచ్చటకు వచ్చినది అసత్యమాడకూడదు

రాజా: అవుననుకోండి కానీ స్వామిగారు ససేమిరా అంటున్నారుగదా!

ఉష: ఏమండీ! పేదవాడు! పైగా బ్రాహ్మడు కనికరించండి పైగా మీరిద్దరికీ ఉపకారం చేస్తారు గదా!

స్వామి: నో! నో! పేదవాడు పేదగా వుండాలి లేకపోతే పేదవాడెలా అవుతాడు ఇకపోతే బ్రాహ్మడంటావ్! నాకు వాళ్లంటే గౌరవం లేదు why అంటావ్ వీళ్లేగదా ఈ దేశాన్ని నాశనం చేసింది

రాజా: ఎలాగంటారు?

స్వామి: నా గొంతెండి పోతున్నది ధీర్ప (సిప్ చేసి) వేదాలు వీళ్లబ్బాయి సొమ్ములాగా దాచేసుకున్నారు వాళ్లకోధర్మం-ఇతరులకోధర్మం ఏర్పరిచారు తాము, తమమాట వినే రాజులు, ధనమున్న భూస్వాములు, వ్యాపారస్తులూ అగ్రకులాలని నిర్ణయించి తక్కినవారిని విడదీశారు కనుక మైడియర్ ఉషా ఏరకంగా చూసినా సిద్ధాంతికి సహాయంచేయటానికి అస్కారంలేదు మిష్టర్ రాజాగారూ సిద్ధాంతిగార్ని వెళ్లమనండి

రాజా: సిద్ధాంతిగారూ తమరు వెళ్లిరండి తమసంగతి తీరిగ్గా ఆలోచిద్దాం!

సిద్ధా: ఆలోచించండి! బాగా ఆలోచించండి ఈ పేదబ్రాహ్మణుని ఏరీతిగా సమాధి చేయుట యుక్తమో ఆలోచించండి కానీ ఒక్క విన్నపము

పితృదత్త మగు నాస్తి హారతమయ్యె వాయందు
ఆయనిచ్చిన భార్య ఆడ్డిపోయె
నా తండ్రి చేసిన నానామహాపుణ్య
కర్మలిగలి గంగ కలిసిపోయె
మిగిలినది యొక్కటే నాకు మేరువంత
బరువు నా గుండెలో మధ్యభాగమందు

ఆహాహిరయ (వెదతాడు)

రాజా: బ్రాహ్మడు నిజంగా ఏడుస్తున్నాడండీ స్వామిగారూ

హరి: అవును. స్వామిగారెందుకో పట్టుదలగా వున్నాడు

ఉష: పిచ్చుకమీద బ్రహ్మాస్త్రం వేశారు

స్వామి: చెప్తాను. తాగండి టీ త్రాగాక నేచెప్పింది విన్నాక అప్పటికీ మీకింకా అన్యాయం అనిపిస్తే చెప్పండి. ఆఫ్టరాల్ ఓ డిప్యూటీ తాశిల్దార్ ఉద్యోగం పీకటం, ఉంతరం పెద్ద కష్టంమేంగాదు- త్రాగండి

(అందరూ డ్రింక్స్ సిప్ చేస్తారు)

స్వామి: రాజాగారూ, ఉంకేళ్ల తోటేళ్లను తరమటం మీకు తెలుసా?

రాజా: నో ఏమండీ హరేరాంగారూ

హరి: నేచదివింది ఇంగ్లీష్‌మీడియం లో

రాజా: నేను ఎక్కడా చదవలేదు

స్వామి: ఫైన్- ఉషా! నీకేమన్నా గుర్తొస్తున్నదా?

ఉష: లేదు

స్వామి: ఆల్ రైట్ అది మీ తప్పుగాదు మనం త్రాగుతున్న డ్రింక్ తప్పుగాదూ

[illegible] పోతె, ఆషిలో ఏమరన్నా, భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నారా?

ఉద్యోగమా। వయస్సులో వున్నవు స్వయం కృషిపై పదిశం
క్రింద వ్యాపారం పెట్టుకో పిల్లా, పీచు, వాదర బండి వుంటది.
నేనే ప్రారంభిస్తాలే।
హలో
ఏమిటయ్యా నీగోల।
మీరెన్నుకున్నవారు కనబడుటలేదా? బదేల్లాగు
అప్పటికీ కనబడకపోతే। రా।
ఏమిటయ్యా అలా మీదబడుతున్నావ్? ఏమిటి సంగతి?
రైతుకూలీనా। ఆగాగు। ఏకటనంది, తప్పు తప్పుకో।
ఇంతైనా ప్రణామ నమస్కారాలు
శహబాష్। మేం నిద్రపోతాం। లేపకండి।
టా టా।
లోలో స్వతంత్ర భారత్‌కి
ఎవ్వరూ జై కొట్టరేం? అసల్ రైత్ జనమంతా మంచి నిద్ర
వున్నారల్లేవుంది జైహింద్-

(వెడతాడు) రాజా,హరేరాం-వెంకటయ్య నవ్వుకుంటూ వస్తారు)

హరి। కవిత్వానికి పద్యానికి సంబంధం వుందాండి।

రాజా। పుంత్తా ప్పు

ఉష। హాయిగా ఉద్యోగం చేసుకోక, వ్యవసాయం, గ్రామాభివృద్ధి అంటూ
వూరికెళ్లాడు ఏం సాధిద్దామనో। తిక్కబాగా కుదిరింది

స్వామి వెంకటయ్యా। బయట ఏం జరిగింది?

వెంక బాబూ ఈయనా హరిశ్చంద్రుడుగారు పద్యాలు కొంతమంది
జై అన్నారండి-- యింకొంతమంది అన్యాయం అన్నారండి
ఆ తర్వాత కర్రలు తీసుకు తన్నుకున్నారండి అయన్నే మో
జనం ఊరేగించుకుంటూ వెళ్లారండి ఈయన

రాజా। మతిచెడిపోలాగయ్యాడు పాపం। స్వామిగారూ మా తండ్రిగారి
పేర ఓ పద్యాసువర్తికి పదిలక్షలిస్తాను.

కాశీ: ఆహా! రాజాగారిది జాలిగుండె

చైత: నాన్నా! మావయ్య అలా అవటానికి కారకులెవ్వరూ?

ఉష: వాడే!

చైత: అమ్మా! నేనడుగుతున్నది నాన్నని

ఉష: ఏమిట్రా ఆ బెదిరింపు. ఆయన భార్యగా చెబుతున్నా

చైత: Mr. Chief Secretary, ఒక పౌరుడిగా, అడుగుతున్నాను ప్రజల సమస్యలకై ముందుకు వచ్చిన వారిగతి యింతేనా ఏం పాలనలో!

స్వామి: ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాల్సిన అవసరం నాకు లేదు

రాజా: బాగా అన్నారు

చైత: వుంది మీరు ప్రజా సేవకులు, సమాధానం చెప్పాలి

ఉష: ఆయన చెప్పరు ఏం చేస్తావ్, మీరు లోపలకు పదండి

రాజా: పదవయ్య పోదాం (హరేరాంతో)

చైత: నాకు సమాధానం కావాలి

ఉష: ఏమిటా బెదిరింపు! ఏం చంపుతావా! ఉరితీసి పారేస్తావా, అయినా ప్రతి తలమాసిన వెధవ అడిగే ప్రశ్నలకు సమాధానాలు చెప్పను అంతే

చైత: అంతేనా?

రాజా: స్వామిగారూ! మీకిలా మెత్తగావుంటే లాభంలేదు. [illegible] కుక్కను కర్రతో కొట్టాల్సిందే.

చైత: అనవసరంగా నోరు పారేసుకోకండి

రాజా: ఏంచేస్తావయ్యా ఆయన మొహంచూసి ఊరుకున్నాం. లేకపోతే-

చైత: లేకపోతే

స్వామి: ఓ! మీరా!

వ్యాస: రాకూడని సమయంలో వచ్చామనుకుంటా మిస్టర్ చైతన్యా! నువ్వు, సమస్యలకు పరిష్కారం తుపాకీ అని నమ్ముతున్నావా?

చైత: నమ్మాల్సివస్తున్నది

వ్యాస: కారణం!

చైత: ఏళ్లంతా!

రాజా: హరే! మేమా!

చైత: అవును మీరే!

హరి: కాదు పూర్వజన్మకృతం పాపం.

చైత: అది మత మౌఢ్యం! మీ కల్పనా

రాజా: పేదవాళ్లందర్నీ భాగ్యవంతులు కమ్మను మేం వద్దనలేదే!

చైత: కాలేరు మీరు కానివ్వరు

రాజా: మేం ఏం చేశాం! ఆడలేక మద్దెల ఓటన్నారు

చైత: వ్యాపారం, మీది, డబ్బుమీది అధికారం మీది

రాజా: అది మా తప్పుకాదే! ఏం స్వామిగారూ

చైత: వారు మీ మతానికీ, మీ డబ్బుకీ కాపలి

వ్యాస: చైతన్యా! ముందా పిస్టల్ దించు

చైత: ఇది వుంటేనేమంది పిల్లి లొంగేది!

వ్యాస: అలాఅయితే హిట్లరూ బ్రతికుండేవాడే! లేదు చైతన్యా రక్తం ఏరులై పారాక మిగిలేది సమాధులూ రాబందులే! ఇది సమాధానంగాదు గాంధీ పుట్టిన దేశం, నెహ్రూ కోరిన సమాజం ఇది కాదు

సమత, సమతావం, సహజీవనం, సర్వమానవ సంక్షేమం ఇవే మన ప్రగతికి సోపానాలు। కీకారణ్యంలో ఆరటి లాభం లేదు. ఆటవికతతో వెలుక్కునే ప్రయోజనం లేదు.

రా, నాతోరా। చిరుదీపం వెలిగిద్దాం। కర్షకుడినీ, కార్మికుడినీ కలుపుకుని రామరాజ్య నిర్మాణానికి ముందడుగు వేద్దాం రా।

(చైతన్య చెయ్యిపట్టుకు ముందుకు వస్తాడు వ్యాసమూర్తి. జంగొప్రాజా హరేరాం - వెంకటయ్య - ఉష కలసికట్టుగా వ్యాసమూర్తినీ - చైతన్యమా పట్టుకోటానికి ప్రయత్నిస్తాడు

స్వామి తుపాకి తీసుకుని వాలగురికి గురిపెట్టి)

స్వామి వాళ్లను పోనియ్యండి. మనకిదే చరమాంకం। ఇక ఇలాసాగడు సాగకూడదు

(వ్యాసమూర్తి - చైతన్య ముందు తెరదాటుకుని జనంలోకి వెళతారు తెర పడుతుంటుంది తెరలోంచి తుపాకి పేలిన చప్పుళ్లు)

— తెర —